# వకుళమాల

(కథల సంపుటి)

(Revised Edition)

— కర్త —

శ్రీ ముదివర్తి కొండమాచార్యులు

ప్రకాశకులు:

వల్లమూడి రామయ్య,

ఎడ్యుకేషనల్ పబ్లిషరు

నెల్లూరు

కాపీరైటు]

[క్రయం 1—0—0

First Edition - November 49
Second Edition - August 50

## Revised Edition

*Approved for class use - Non-detailed Study for Secondary Schools (Higher Forms) by the Text Book Committee, its meeting held in February 1950 (R. C. No. 320/49 T. B C. D/ 12-6-50)*

# కథల సంపుటి




| గద్యము | | పద్యము | | |
|---|---|---|---|---|
| (1) రక్షాదీక్ష | ... | (శ్రీ శివభారతము) | ... | 1 |
| (2) పరివర్తన | ... | (ధర్మదీక్ష) | ... | 24 |
| (3) కవితాప్రభావము | .... | (భారవి) | ... | 45 |
| (4) దేశభక్తి | ... | (వీరమనీడు) | .... | 63 |



## — కృతజ్ఞత —

తమకు సర్వస్వామ్యములుగల, పద్య కృతులనుండి, ఈ గాథలను, గద్యరూప మొనరించుట కనుమతించిన ఆ యా యుదారులకు కృతజ్ఞతా పూర్వక వందనములు.

(1) రక్షాదీక్ష — (శ్రీ శివభారతము) మహాకవి, కవితావసంత కవిసింహ అవధాని పంచానన శ్రీ గడియారము వేంకటశాస్త్రిగారు.

(2) కవితా ప్రభావము — (భారవి) శ్రీ వరిమడుగు కామయ్యగారు.

# రక్షా దీక్ష

శివాజీమహారాజు న్యాయరాజ్యవ్యవస్థను సిద్ధపఱచి దేశమును పరిపాలించు చున్న కాలమది. అప్పటికే మొగలు చెఱసాలనుండి యాపులి తప్పించుకొని వచ్చినది. ఔరంగజేబు కుమారుఁడగు "ముజం" ప్రభుని అభిమానమును సంపాదించి వారితో మైత్రీనిబిడమగు సంధి యొనర్చుకొన్నది. ముజంప్రభుఁడు కాళావినోదరసికుఁడు. అతనికి తోడుగాఁ బంపబడిన యశవంత సింహుఁడు హైందవ పక్షపాతి. తమసైనికులు జరిగిన పోరులలో డస్సిపోవుటయు, క్రొత్తసేనల సహాయము వచ్చెడి దారి లేకుండుటయు కారణములు కాగా, దక్షిణాపథమునకు నాయకునిగాఁ బంపఁబడిన ముజంకుమారుఁడు యుద్ధము లొనర్చుటమాని వేఁటల విలాసములతో కాలమును గడఁద్రోయు చుండెను. శివపతి—ఇది నిజాభ్యుదయమునకు సమయ మని తలఁచెను. తనకు రావలయు పన్నులకై బిజాపురిపతి కడకు దూతల నంపెను; ఆదిలుషాహి మొగలుల చెలిమితో బలము సందిన శివప్రభుని ధిక్కరింప లేక సాలునకు మూఁడు లక్ష లర్థ మిచ్చునట్లు సంధి యొనర్చుకొనెను. గోలుకొండయు సంవత్సరమున నైదులక్షల ధన మిచ్చుటకు భయభక్తులతో నంగీకరించెను.

పలు దుర్గములను, పర రాజ్య సీమలను పట్టి సేనలును—సైన్య పతులును భక్తి భావమున భజింప నిరంకుశుఁడై శివాజి రాజ్య మేలుచుండుటఁ జూచి మొగలు సార్వభౌమునకు కన్నెఱ్ఱ నయ్యెను. ముజం ప్రభుఁడు ప్రతీకారము సలుపక, వెనుకాడుట కౌరంగజేబు భగ్గనమండి పడి ఇట్లుత్తరు వంపెను.

"——దక్కనుఁ జేరి భోగ పరాయణుఁడవై, టక్కరి యగు శివాజీ కపటమునకు లోఁబడి వానితోఁ జెలిమి సేయు చుంటివి. వాని సేవకులను చుట్టుఁ జేర్చుకొని తిరిగెదవు. ఇట్లయినచో 'దక్కను' మనకు దక్కునా? అతఁడు దక్కనిచ్చునా? ఇది నీకు తగదు. మా యీయుత్తరు వందిన వెంటనే వాని సేనాపతులను చెఱఁబట్టుము. ఆపైని నతనిని గూడ బంధింపుము. లేనిచో మా కోపవృత్తికి నీవు గుఱియయ్యెదవు. దీనినిబయలు పడనీకుము."

ఈ ఉత్తరువు లందకమునుపే గూఢచారులు పరుగుపరుగున వచ్చి సంగతి నంతయు ముజం ప్రభునకుఁ దెలిపిరి. ముజం కుమారుఁ డాప్త వంచన యెఱుఁగని పరమ సాత్త్వికుఁడు అంతు దెలిపి శివపతి సైన్య పతులను తన పొత్తు విడిపోవునట్లు చేసెను. పిమ్మట తండ్రి యుత్తరువు నందుచు, వారిని వెంబడించు నార్భటినిజూపి "మీ యాజ్ఞ వచ్చునప్పటికే శత్రువులు తొలఁగి పోయి" రని తండ్రికి కబు రంపెను.

ఇట్లు పాదుషా సంధిబంధములు తెగఁద్రెంపుటకు శివాజీ కాల

రుద్రుఁడయ్యెను. ఉద్యోగులను, సైన్యనాధులను, సచివోత్తములను గని యిట్లు వాకొనెను.

"——ఇంతకాలము మనము మొగలు బలఁగముపై దండెత్తిపోక వారుపైఁబడినపుడు మార్కొను చుంటిమి. మనము పైఁబడి క్రుమ్మకుండుటచే వారా చెడుగు లిప్పటి కైనను మానరు. పాదుషాతోడి సంధి ప్రాణములకు గుఱివెట్టుట యైనది. ఆనాఁడుమమ్ము కొలువుకు రమ్మని చెఱలోఁద్రోయుటగాక, ఈనాఁడు మ్రుచ్చులవలె పొంచి పైఁబడుచున్నారు. భారతరాజ్యమును చేతఁబట్టుచు చూపులు మార్చి యితఁడెన్ని కొంపలు రగిలించెనో కదా? హైందవప్రభువగు నగ్బరును—అతని పుత్రుఁడగు జహంగీరును—మనుమఁడగు షాజహానును ఈ చందమువారా? తండ్రిని చెఱఁబెట్టి ప్రాణములు దీసిన కక్కసీనికి హైందవజాతిపై దయాగుణ మెట్లుండును? రాజధర్మపు పొందిక యెట్లుండును? ఇట్లైనచో ప్రభుత్వము నిల్చునా? నిలుప నేర్చునా? రాజ్యకాంక్షచే తాను పలు దారులు దూరిన దూరుగాక! దేవతాలయములన్నియు ధ్వంసమొనర్చునా? సాధుగోమాతలను సంహరించునా? హైందవమతాగమముల తగులఁబెట్టునా? దైవమేమని కనుమూయును? ఇది యంతయు చూచి లోక మెట్లోర్చుకొనును? లోకమును—దైవమును మిన్నకుండిన నుండుఁగాక! ధర్మ రక్షా దీక్షఁబూని నేను కత్తితో ముందున కుఱికెదను. నాకు ముందు పడి దుముకు ధీరులను తోడుగొందును. బంధీకృతయగు భారతజనని కాలి సంకెళ్ళను త్రెంచివైచెదను. అమ్మనోచిన నోముఫలము, దాదోజీ

శిక్షణము, రామనాథమునినాథుఁడొసగు విజ్ఞానము, మీజుజాబలము తోడై యుండఁగా శాత్రవశిరములను చండికా పూజాపుష్పము లట్లు కోయక విడుతునా? పాదుషా తన బలములతో గుంపుఁగట్టి దక్షిణ భూభాగమును ముంచిన ముంచుఁగాక! ప్రమథగణముల మించు బలఁగముతో ప్రళయ తాండవము నేపుజూపుచు పులి వేఁటలాడుదును. కదలిన దండు శత్రుసమూహములు నర్మదానదిలోఁబడిపోవు దాక వెను కడుగు వేయరాదు. పాదుషా ఒదిగి నట్లు నటించినను మనము విడువ రాదు. హైందవప్రాభవము దక్షిణాపథమును నెలవుఁజేసికొని ఉత్తర భూములనేలుఁగాక!

దుర్గముల లోఁగొను టిప్పుడు ప్రధానము. మొగలు దుర్గములందు సింహగడము ముఖ్యమైనది. మర్మ విదులగు శత్రువులు దానికి కాఁపుండి దక్షిణరాజ్యముల నాక్రమించుటకు తఱి వేచియున్నారు. కావున, మున్ముందు సింహగడము నాక్రమించి, ఆపై "పురంధరము"ను, పిమ్మట "మాహులీగడమును" పట్టినచో—యవనసేనలు నీటినుండి వెలి కీడ్వఁబడిన మొసళ్ళవలె నిర్వీర్యములగును. అయిన, సింహగడము నాక్రమించుట అంత తేలికయైన పనిగాదు. దుర్భేద్యములగు కొండలచేఁ జుట్టబడి చుట్టును గొప్ప యగడ్తఁగలది. కాకి దూరని కాఱడవిచేఁగప్పఁబడి, పై కెగఁబ్రాఁకరాని కొండకొమ్మున నున్నది. యవనులగు తుగ్లకు వంశ్యులు దక్షిణ దుర్గముల పెక్కింటిని గూల్చినను నాఁటికిని నేఁటికిని ఇది చెక్కుచెదరక వెలయుచున్నది. దీనినిఁ బట్టకున్న స్వరాజ్యము నెట్లు

నిల్పు కొనగును? మాతృదేవి నిన్న మేడపైకెక్కి వాయువులానుచు గగనమునంటు సింహగడమున నొడ్డిన మొగలు బావుటా వంక దృష్టిసారించి ఘంచుతెఱ గప్పిన ఱెప్పల నన్నవలోకించెను. ఇంత యున్నతి నందియు, నామెకంటి తడి యొత్తుటకు చేతులులేక నిలిచితిని. లోకమాత తల్లి హృదయశల్యమగు శత్రుపతాక నూడఁబెఱుకని నన్ను లోకము మెచ్చునా? ఇప్పుడేపోయి సింహ దుర్గ కవాటమును కూలఁదన్నెదను. కోట కవాటపు గుబ్బలను ఱొమ్మునఁజిడిమి కూలఁదన్ను మేఁటి భటులున్న నిటురండు. తన యున్నతికి తల నెగురవేయుచు మిన్నుఁజూచుచున్న యవనపతాకను లాగు వీడున కీకుడిపీఠము ఉపాయన మగుఁగాక!!

౨

తానాజి లేచి గండు మీసములు దువ్వుచు వలపలి వీరకంకణము నెగఁదోపుచు వాలు దూయు కుడిచేయి నేలసోఁక జొహరు పెట్టుచు ఛత్రపతి కిట్లనెను.

"—మహాప్రభూ! మీకు జయము. ఒక యసాధ్యమును తీర్పనెంచు మీరు కొలువువైపు నంశయమునఁగనుటేల? ఒకఁడొకఁడె సింగపుఁ గొదమను అచ్చ కీడ్చుటకును, మేరుమందర పర్వతములతో బంతులాడుటకును మావళాభటులు సమర్థులు. అట్టిజగ జెట్లతో జగముల నొకెత్తు గఁ జూపఁ జుట్టు తానాజీకి సింహగడ దుర్గ కవాటము లేమిలెక్క? యవన

రాజ్యలక్ష్మి కేతువును తిగిచి మీ శ్రీచరణములకు కానుక వెట్టఁడా? పుట్టిననాటఁగోలె భయమెట్టిదో యెఱుఁగక మీపాదములను చేపట్టిన నాటఁ గోలె తొలిప్రాణమును మీకయి యెత్తి పెట్టి మీరుకట్టెడు రాచమేడకు పెను కంబముగ తలయొడ్డునాకుగాక వేఱొకనికీయనుగ్రహమును పోనిత్తునా? ఎవఁడా దీరుడు? శివుఁడా—కేశవుఁడా? నన్నుఁగావని యా బావుటా దీయువాఁడు? ప్రభూ! ఈ మీయనుగ్రహమును మఱొకనిపైవర్షింపకుఁడు. యవనకేతువును వ్రయ్యలుసేయుట నావంతు. మీరిదియంతయు చూచు చుండుఁడు. దేవా! మీపాదసేవకున కీపాటి చనవీయఁజెల్లదా?

మీకుడియెడ నున్నతాననము కోరుటలేదు. మీపాద పీఠియందు కేలిడఁగలచోటుచాలును. మీకడగంటినీడ పయిఁబడఁగల చోటు చాలును. ఇంత కరుణించిన స్వర్గము నేలినట్లగును. మహాత్ములగు మీతోఁబుట్టువు లము కాఁదగము. జనను, నాకును—మావళాజనుల కును 'జిజాంబ' కన్నతల్లి. ఆమె యాత్మతృప్తికై పాటుఁబడు వారిలో ప్రధమ బాధ్యత నాది. ఇంతకన్న నతిక్రమించి కోరిన దేదియునులేదు. దేవా! తల్లి ఋణముఁదీర్ప నన్ను కటాక్షింపుఁడు. నా యడుగు లంటని చోటులు సింహగడమందేవియునులేవు. కోటపై కెక్కుడుదారులు—మాఱు త్రోవలు నా యెఱుఁగనివి కావు. భవాని కటాక్షము తోడుగా సింహగడము నైదవనాఁటికి గెలిచి తెత్తును."

ఇట్లు ప్రతిన వట్టి తానాజీ పదేండ్ల చిఱుతయగు తన పుత్రుని శివ పతి చేతఁబెట్టి—

"ప్రభూ! ననుఁబోలె వీనినిఁగూడ మీచరణదాసుని గావించుకొండు. నేను చేయఁగలిగిన తమసేవ అఖండ దీపమై వెలుఁగుగాక! ఇంకొక్క మాటః ఇతని కొడుకు రాఁబోవునాఁడు పెండ్లి. అనాటికి శత్రువులతో మార్కొన్న నేను వత్తునేని బాసికమును చూతును. కానియెడ నే చెప్పవలసిన దేదియులేదు. వీనికి సమస్తమును మీరే. సింహగడ మిప్పటికే నను తొందరించుచున్నది. నేనిఁకఁబయనింతును. వెడలిన తానాజి వట్టిచేతులతోరాఁడు. ఐదవనాఁటి రేయివేఁగులోపల సింహగడము పైవెలుఁగుఁ జూచి విజయానందము నందుఁడు. ప్రభూ! నాకిక సెలవిప్పింతురా?"

అని పలికెను. శివాజీ అపరిమితానంద భరితుఁడయ్యెను. తానాజీ చేయిబటుకొని

"——తానా! సౌహార్ద సూత్రమున నన్ను బంధించితివి. ఇట్టి సాహసము నెట్లు సాధించితివోయి! తనయుని పెండ్లికి నీవదను" తప్పరా దని తలచి, "సింహదుర్గమును జయింపఁగల వీరుఁడెవఁడని కోరితిని గాని, మతొండు గాదు నీమనసు నేనెఱుఁగనా? నీభుజశక్తి నాకుఁదెలియ నిదా? ఇది తప్పనఁ గూడదు, ఒప్పనుటకుఁజాలిమిరాదు. అన్నా! జయ మునఁబోయిరమ్ము. నేను నిన్నను సరింతును. పయి దుముకు శత్రు వులఁదునిమి కార్యమును సాధింపుము. భవాని నిన్ననుగ్రహించుగాక!"

అని తాంబూల నవాంబరాభరణ మాల్యాదులు బహుకరించి వీడ్కొ లుపగా, తానాజీ తనగృహమున కరిగెను. ధీరులగు నాప్తులను రావించి

మంతనములు సలిపి, ఉపాయములు తెలియఁబలికి సన్నాహములఁ దీర్చెను. చారులఁ బంపి దుర్గము నందలి సంగతిని—వెలుపలి దారి తీరును, ప్రాకారము లెక్క వైనమును, కోటపై కావలి వారల పెంపును, వారిసైన్య విస్తారమును, దుర్గనాథుని బలసంపదను తెలిసికొనెను. అద నెఱిఁగి సింహగడమును గెలుచుటకతఁడు వీరభటాళితో నడచెను.

## 3

అది మాఘ మాసాంతమగు కృష్ణనవమి. కటికచీఁకటులు బలిసిన కాళరాత్రి. ఘాతుక వనజంతువుల కహకహార్భటులను గుహలు మాఱు మ్రోయించు కొండదారి. పడగల విప్పుగొని బుసలిడునట్టి కోడె నాగులు చెరలాడు అగాధపరిఘ. ఎగఁబ్రాఁకుటకు తెఱపి యొసగని కొండ కొమ్ము. తానాజీ తనపరివారముతో బహుప్రయాసల కోర్చి చేరికొనెను. అతఁడు కోట నైర్ఋతి కోణమందుచేరెను. అచటి కోటగోడ దిటమైనది; నునుపైనదికూడ. కావున రక్షకు లీబాగమ్మున కావలి యుండరని భావించి తానాజీ తన వీరభటావళిని హెచ్చరించుచు కోటపైభాగపు కొనసంటుకొని పట్టువిడవక యుండునట్లు ఉడుమును విడుచు నట్లును, దాని నడుము నకుఁగట్టినత్రాడుఁను పట్టుకొని తాను పైకెక్కి త్రాళ్ళమేకులను దించు నట్లును, వాని వెంబడి మావాళా భటులేనూఱుగురుకోటఁబ్రాకినట్లును, తదుపరి తమ్ముఁడు సూర్యాజి మిగిలిన యేనూఱు బలగముతో వెంట వచ్చునట్లును, తాను ముమ్ముందు శత్రువులతోఁ దలపడి యుద్ధమొనర్చు చుండగా—అదనును బట్టి సూర్యాజీపైఁ బడునట్లును హరహర ధ్వనులతో

తమ్ము తెలిసి కొనునట్లును సంకెతములు వంచించెను.

తానాజి యుడుమును చేతబట్టుకొని లాలించి, నడుమునకు త్రాడు గట్టి దానిమోమున చెందిరపునామమును బెట్టి

"—కాళీకా! చిడిముడి పాటునందక జయసిద్ధిఘటింపుము."

అని విడువగా నది పైకిఁబోక వెనుక మొగమునఁగ్రిందికి దిగి వచ్చెను. అది యశుభమని—దుశ్శకునమని భటులు విన్నవోయిరి. తానాజీ చెదరని యాత్మ నిగ్రహముఁగలవాఁడు. విధిని గదిమెడు వాడి చూపుల ఎగాదిగఁ జూచి దానిని క్రింది కీడ్చి బుగ్గల నులిమెను.

"—కాళికా! శాత్రవులను మట్టుఁబెట్టు తానాజీ కఱకుఁదనమును మఱచి పోయినావా? ముందిడిన కాలు మరల్చి నట్లు చూచినావా? మును పిరువదేడు దుర్గములను లోఁగొను వేళలందు సాయపడి నేఁడు 'అంకె' వైచుకొని పండు కొందువా? నీకిది క్రొత్తచదువా? నిన్ను జాఱ విడుచు నంతటి వెఱ్ఱివాఁడనుగాను. శివప్రభుఁడు నమ్మికతో నా తలపైఁ పెట్టిన భారమేమి? తల్లి మననంటిన నెవ్వగను దీర్చుటేమి? కొలువులోఁ దీవ్ర ముగ ప్రతిన పట్టుటేమి? ఇపుడు నీవు చేయుపనియేమి? నన్నిట్లు పరాభవాగ్నికీలల మ్రగ్గింతువా? అయువులున్నంతదాక నీకును, నాకును వెనుకాడుటకు వీలులేదు. బ్రహ్మాయువుతో వైరులెదుర్కొనినను వారి కుత్తుకలను కోసి కుప్పలిడక మానను. సింహగడ దుర్గ యవన కేతు వును తీయక మానను. పొమ్ము. వెనుదీయక కోటనుబట్టి నిలువుము."

తానాజీ యుడుమును గద్దించుచు కోటపై విసరి వేసెను. అదియును కోప ఘూర్ణ మానసముతో తివ్వన పైకెగఁ బ్రాఁకి యొక్క త్రుటిలో కోట పైకెక్కి పట్టు వీడక నిలిచెను. తడనే తానాజీ సన్నాహ యయ్యెను. నడుము పట్టికలో పిడిబాకును దిగవోఁపి కొనెను. కరవాల మును వ్రేలాడగా నిమిడ్చెను. కుడి బుజమున వేఁట కొడవలి దిగవైచి, దానిపై ధనుస్సు నిఱిగెను. దాపలి బుజము నొత్తగా నంపపొది వెట్టు కొనెను. మూపుపై డాలును బిగెయఁ గట్టు కొనెను. నడుము చుట్టును మోకులను చుట్టుకొని యందు నీటెను దోఁపికొనెను. ఇట్లు పైకెక్క నాయిత పడు తానాజీ తన వేసమును చూచుకొని పొంగిపోయి యుబికి యెగఁబ్రాఁకి కోట నెక్కెను.

నాల్గు వైపులను జనముల సవ్వడిలేదు. తానాజీ పైచాలుసందు మేకులు నాటి మొకులు దిగజార్చెను. మావళాభటులు త్రాళ్ళ నూదిపట్టి యెగఁబ్రాకు చుండిరి, అతఁడు పైనేలకుఁ జేరినవారిని శయనింపఁ జేయుచుండెను. సరసరమను చప్పుడునకు మొగలు సైనికుఁడొకఁడా యెడకు వచ్చు చుండెను. వాని యడుగులసద్దు విని గుఱిపెట్టి తానాజీ వాఁడి బాణమున వానినిఁ బడఁగూల్చెను. దండడిసేయక మావళులు త్వరత్వరగా నెగఁబ్రాఁకుచు కోటమీఁదికిఁ జేరుచుండిరి.

ఒక మావళావీరుఁడు పైకెక్కునపుడు పట్టుసడలి వాని నడుముపైఁ గట్టియున్న నిశిత ఖడ్గము జాఱి సోలపైఁబడఁగా "ఖంగు"న చప్పుడైనది.

ఆ వెడసవ్వడినినిని గుంపుగట్టి కావలివారు పరువెత్తివచ్చిరి. తాము సించిన కార్యము చెడునని తానాజీ తొందరగా, నప్పటికి కోటపైఁజేరిన యేబదిమంది మావళావీరులు, తన్ననుసరింపగా, కృపాణ పాణియై రక్షకులపై దూకెను. ప్రళయకాల కృతాంతులవలె మావళాభటులు ఆకటిక రేయి కావలివారలను చుట్టుముట్టి కత్తులకు బలివెట్టగాఁ, గుండెలవిసి వారు పరువిడఁజొచ్చిరి. కాని తానాజీ యొకనినిఁగూడ జాఱపోనీక పయిఁబడి కుత్తుకలఁ దఱిగెను. కోటపై నిట్లు భీకరసమరము జరుగు చుండఁగా మావళావీరులు చీమబారువలె పైకెగఁ బ్రాఁకుచు కోటకెక్కి తమవారితోఁగలిసి దర్పముఁ జూపుచుండిరి. రక్షకులు మఱల గుంపు గట్టుకొని యాచిమ్మచీఁకటిలో పైఁబడిపోరిరి.

“ఎందఱో? ఎవరో? అక్కడికెందుకువచ్చిరో?” యని తడబాటు జెందుచు, కనుల చూపులకందని కత్తిపోఁటులఁగుంది, కావలి వారా చీకఁటిదయ్యపు వెలకాంద్రచేతఁబడి మడియుచుండిరి. అంతటివఱకు మౌనమున కానతిచ్చిన తానాజీ వైరుల మదమడంప ‘హరహర’ ధ్వని సేయుచు ముందుకు సాగెను. అతని భటులును ‘హరహర’ యని అఱ్చుచు విరోధులపైఁగవిసిరి. తమ్మెదిరించువారిని హతమార్చుచు సాగి పోయి, “జింజిరాబురుజు” కావలివారలఁజంపి దానిపై నమర్పఁబడిన ఫిరంగి నోరును ముక్కలుగాఁ పగులఁగొట్టి తానాజీ కవాటసీమకుఁ జేరెను. ఆ యులజడిలో ద్వారపాలు రాయుధములకొఱకు తడమాడు చుండగా, మావళులుకవిసి తలుపులు దెరచి లోనికి జొఱఁబడిరి. సింహ

గడమంతయు పద్దరిలిపోయినది. ద్వారపాలుఁడీ యుదంతమును దెల్పఁగా దుర్గనాథుఁడబ్బురపడి కోపఘూర్ణిత మానసుఁడై రణరంగమున కొక్కదూకుతో వచ్చెను. రాజపుత్రకులరక్తము నాడులఁబొంగి నయనముల దీపించుచుండగా, తనదుర్గ విభుత్వ మిట్లు బెండగుట సహింపలేక తనసైన్యమునెల్ల నొక్కచో గుమిజేర్చుకొని 'ఉదయభానుఁడు' శాత్రవులను బొడిచెను. మొగలు దండుతో రసపుత్ర బలగముగలిసి మావళా దండుతో తలపడెను. మరాటి బంటులు కరలాఘవము మెఱయ వైరిశిరములను తెగఁ గోయుచుండిరి. ఆ చీఁకటి యుద్ధములో శత్రువుల కత్తులకు గుఱి యగుచున్న తన బలఁగమును పైకొనఁ జేయఁదలఁచి యుదయభానుఁడు కాకర—బీర పూచినట్లు దివిటీల కాగడాలు వెలిఁగింపఁజేసెను. ఉదయభానుఁడు నల్లత్రాచువంటి కత్తిని చేఁబూని జళిపించుచు తన సైన్యమునకు సముత్సాహము గల్పించెను. తమసర్దారుని యండఁ జూచుకొని రసపుత్ర వ్యూహములు గండు మీరి శాత్రవ సైన్యముపై దివిటీల వెలుఁగున వివిధాయుధ నాట్య భంగిమలు ప్రదర్శించినవి తానాజీ మేఘము వలె గర్జించి తన భటులను వీర రస ముప్పొంగు మాటల దొప్ప దోఁగించెను.

"———భటులారా! ఇక రణరంగమునఁ జెరలాడుఁడు. మావళా కీర్తి కారణమైన యుద్ధము వచ్చినది. శాత్రవ శిరములు తెగఁగోసి భేతాళ పారణములు సేయుటకు వేళయైనది. విరోధులు జారి పోకుండుటకై కాళరాత్రి కోపానలారుణములగు వేయి కన్నుల విచ్చినది. మావళా

వీరుఁడొక్కఁడు తొడదట్టి నిల్చిన పులియును, సింగమును ఏనుగును— గడగడ లాడుచు పరుగు లిడును. ఇఁక యవన సేనలన నెంత? ఇపు డుద్రేకించినచో నీ గడమును పాదుతో పెల్లగించి శివప్రభున కర్పింపరా? రణవీర పట్టభద్ర బిరుదముతో, రాచ కొలువులో విలువును జెంప నదను వచ్చినది. ఇంక తారాట తగదు. అదిగో! తూరుపు కొండపై నెఱుపు తోచుచున్నది. కొంచెము సేపటిలో నెల యుదయించును. కోఁడిపుంజు విజయగీతికలు పాడగా రిపులఁదునుమాడి మొగలు బావుటా కదలించుడు. మసల హతమార్పఁ బాపము! వీరుకరదీపములఁబట్టినారు. ఇట్లు పరోపకార మొనర్పఁదలఁచిరి గాఁబోలు! ఈకాగడాల వెలుఁగున శత్రుగాత్రములను సంధులు గొయ్యుఁడు. కాలరుద్ర పరిపాటిని వాలుగొని యావైపు మొగ్గరమును జీల్చెదను. నావెనుకరండు. కత్తివ్రేఁటు దినియు ప్రాణములు వీడని ప్రతిపక్షుల తలలను మీఁదు కఱుక్కున తెగఁ ద్రెంపుడు.''

తానాజీ చెంగున లంఘించి యవనసేనను నురమాడఁ జొచ్చెను. వానిభటులును నలువైపుల విజృంభించి, పొంచి, నిరోధించి శత్రువులఁ గూల్చ సాగిరి. అడ్డుపడిన రిపుల మునుముబట్టి యాఁచకోఁత కోయుచు తానాజీ నడికోటజేరెను. అతని ధాటికి మొగలు సైనికులు దీనతఁజెందిరి. దుర్గనాథుఁ డుద్ధతితో తనసేనను పురికొల్పిన తానాజిపైఁగవిసెను. ఎదుటఁ దోఁచిన యేన్గును గన్న సింగమై తానాజి యుదయభానుని పయిఁబడెను. ఇట్లు సేనాపతు లిరువు రెదురెక్కి ఒకరినొకరు చంపుకొను

టకు మచ్చరించుచుండిరి. ఖడ్గకౌశలము మెఱయ నిద్దరు పెనఁగిరి. కావరమునఁ దల లొడ్డిన కోఁడెలవలె — మదగజములవలె క్రుమ్ము లాడుచు, వెనుదీయక రక్తధారల మునుఁగు చుండిరి.

నరినరిఁ బోరుచున్న ఉదయభానుని బాహుబలమున కోర్వక తానాజీ వాఁడి బల్లెముతో వానిభుజమధ్యమునఁ గ్రుమ్మెను. ఉదయ భానుఁడు సోలితూలి తెప్పఱిల్లి బలమెల్లఁ బోయుచు వాలుతో తానాజీని వ్రేసెను. తనపైఁ బడుకత్తి వ్రేటును ఎగఁ జిమ్ముటకు తానాజి డాలు నొడ్డెను. అదివ్రయ్యలై పోగానడుమునకుఁ జుట్టుకొన్న యుత్తరీయమును డాపలికేలునకుఁ బెనవైచుకొని రసపుత్రనాథునిపైఁగవిసెను. డాపలి కేలు పైబడుఁ కటారునెగ జిమ్ముకొనుటకు డాలులేనందున తానాజీ యెడమ చేయి తెగి నేలఁ బడినది. కోపము—పరాభవము రెండుకనుల నిండగాఁ నఁతడు పిడిబాకు నెత్తి దుర్గవిభునిపై దుమికొను. కాలరుద్రునివలె నున్న తానాజీనిగని శాత్రవసమూహము చెదరి పోయినది. రణకోవిదుఁ డగు ఉదయభానుఁ డెంత లాఘవముఁ జూపియు గండరగండఁడగు తానాజీ భుజాదండమును నెట్టఁజాలక వెతఁజెందుచుండగా తానాజీ వానిని నేలఁ బడవైచి గుండెపై నెక్కెను. పండ్లు పట పట గీఁటి యుదయభానుని గళ మునుగోసి భీకరముగ నార్చెను. ఈతెఱపిలో దాపుననే పొంచియున్న శత్రు పక్షపు భటుఁడొకఁడు వెనుక పాటున దూకి తానాజీ కుత్తుకను ద్రెంచెను. ఇట్లు మహ వీరులిరువురును నేల కొఱగిరి. ఒకని నొకఁడు మ్రింగుటకు చెరలాడిన సేనానాయకులు పరమాప్తులుగా వీరశయ్యపైఁ బన్నుండి

కన్నులు మూసిరి. ఈచిత్రమును చీఁకటి తెరఁ జీల్చుకొని తూర్పున బారెఁ డెక్కుచు లోకభాంధవుఁడు చూచెను.

౪

రసపుత్ర సైన్యములు—మొగలు బలఁగము, మావళాభటులపైఁ గవిసినవి. అదాటున తండ్రిని బాయుబిడ్డలై మావళావీరులు తెగువతోఁ బెనఁగ లేక వెనుదీసిరి. సూర్యాజీ త్వరితుఁడై బలఁగముతో కోటనెక్కి దుర్గద్వారమును జేరునప్పటికి పరావృతమగు స్వీయ భటసమూహము గాన్పించెను. ఇంతలో కర్ణ కఠోరమై తానాజీ కన్నులు మూసినవార్త వినఁబడెను. సూర్యాజి ఒక్క నిమేషమట్లే యెగ యూపిరితో—నిలిచిన చూపుతో—వ్రేలాడుగ నిచ్చిన డెందముతో స్తంభించి పోయెను. ఎఱ్ఱనైన కనుఱెప్పలనుండి కన్నీటి చుక్కలొక్కటొక్కటిగ రాల నా తెరపి నుండి కోపాగ్ని కీల చెలరేఁగ చరచరకోట వైపున కేగి త్రాళ్ళను గోసి కరవాలము పైకెత్తి ముందునకు దుమికి భయభ్రాంతులై పరువిడి పోవు చున్న మావళాభటుల నాపి జాతి పౌరుషము కుత్తుక బంటిగాఁ బోయుచు నిట్లనెను. "—అచ్చపు మావళా వంశమునఁ బుట్టిన వీఁరుడు చిచ్చును మ్రింగి పగతుర చీల్చి చెండాడునేగాని వెన్నిచ్చి పరువిడునా? కాఱు సింగముల నెక్కి స్వారిఁజేయువారి కీ పిచ్చుకలెంత? వ్రేఁటున కొక వేయిగా గొంతులు గోయఁగూడదా? తానాజీ నాకును, మీకును తండ్రియు, ప్రభువును. ముక్కాకలు దీరిన అట్టి వీరపౌళి కదన రంగమున కన్నూమయఁగా నతని నేకాకి నొనర్చి యేగు పాఱుబోతులకు సిగ్గా?

మానమా? పగదీర్పలేని మగలను మావళాకాంతలు పేరంటములు బిలువరా? వంశమర్యాదకు, రాజ్యకార్యమునకు ఎగ్గులొనర్చి తానాజీకి తలవంపులు ఘటించి మీరు బ్రదుక నిచ్చగించు చున్నారా? కోట త్రాళ్ళుతెగఁగోసితిని. భయముతో కోటనుండి దూకితిరా నుగ్గు నుగ్గై చత్తురు. పరుగెత్తి పోతిరా పగతురే పయిఁబడి ఖండింతురు. ఇక సంతయు వట్టియాన. వెనుకాడిన లాభములేదు. గుండెను తిరమొన రించుకొని కటారు గొని కాలాంతకుని దూతలై శత్రువుల నాహుతిఁ బట్టుఁడు. తానాజికి మనశ్శాంతినిఁ గూర్చుడు. ఈ యవనసేనలు మిమ్మేమి యొనర్పఁగలవు? మానమనీయడగు మావళా కులములోఁ బుట్టిన మగవాఁడెవఁడును కాలుమఱల్పరాదు. అరులను హత మార్చుటయో—హతమగుటయో దప్ప ప్రక్కకుఁ జూడరాదు. జయము గొనుట నావంతు. లేదా, స్వర్గమునే బడయుదము. తొలికోఁడి కూఁత వినలేదా? సభలో తానాజి పంతము బలుకుట వినలేదా? గడముపై కేరింతలాడు మొగలు జెండాను మన్నింతురా? ఇఁక తామసింపఁదగదు. నావెంట రండు. శత్రు బలముల వెన్నంటి వేఁట లాడుదము."

సూర్యాజీ యదలింపుతో మావళావీరులు హర హర యని గర్జిం చుచు నొక్క పెట్టున మొగలు బలఁగముపైఁగవిసిరి. కార్చిచ్చు పెను మంటల వలెఁజుట్టుకొనుచు, సముద్ర తరంగముల వలె పైకొనుచు మావళులు రౌద్రావేశముతో వైరులు డస్సిపోగాఁబోరాడిరి.

ధైర్యోత్సాహములు తలమిఱు మగఁడై తానాజికి తమ్ముఁడై

సూర్యాజీ రిపు కంఠములు నఱికి కుప్పలు వేయుచు వెన్నాడి వేఁటాడఁ జొచ్చెను. మూఁగిన మావళా వీరుల పోటున కోర్వలేక, సాహసోద్యోగముఁజూపు దుర్గపతి హతమగుట వలన నూఱట లేక, వెనుకంజ వేయలేక, పెనఁగలేక ఉఱ్ఱూఁగుచు విరోధులు మరాటా కత్తుల కెఱయైరి.

రనపుత్ర సమూహములం దేనూఱు కబంధములు దొరలఁగా మొగలు సేన విచ్చి పాఱి పోఁజొచ్చెను. "పరువులిడు రిపులపైఁబడకుఁ" డని తనబలమును సూర్యాజీ మరలించు కొని గడముపైకెలుకుచున్న మొగలు బావుటా నూడఁబెఱికెను. ఎవరు నడ్డములేని గడముపై నున్న జెండా నూడఁబెఱికి శివప్రభుఁడు గెలుపును గుఱుతించునట్లు శిఖరమున పెద్ద వెలుఁగును బెట్టిరి. సూర్యాజీ పిదప జాగరూకుఁడై గడము నంతయు లోబఱచు కొనెను. పలపల తెల్లవాఱు లోపల మొగలుకేతనము దింతునన్న అన్న పలుకును నిలబెట్టి సూర్యాజీ రణరంగవీరశయ్యా దీర్ఘనిద్ర జెందిన అన్నను డాసెను. అన్న శరీరమున చాఱికలు గట్టిన నెత్తురును కన్నీట సోనలఁ గడిగెను. తన మనసులో నింత తాపము తారాడుచున్నను, ఎట్లో యోర్చుకొని, సమయజ్ఞుఁడగు సూర్యాజీ పట్టు తివాసీల పల్లకిలో అన్న కళేబరము నుంచి, సింహదుర్గమును గాపాడ సేనల నిలిపి, శత్రుబలమును దుర్గమువలకుఁ బాఱఁదఱిమి, శరణన్న వారి కాశ్రయ మిచ్చి, తనచేతఁబడిన శత్రు ధనమును వెంబడిఁ గొనుచు, కొంత బలఁగము ముందు నడువగా. అందలము లోని యన్నను ననుస్మరించుచు, పయనమున కామతించెను. శివరాజు రాయగడము లోని

చంద్రశాలా తటమున నెక్కి సింహగడము లోని వెలుఁగును జూచి, యాఱఁటఁజెంది విజయోత్సవ సన్నాహములఁదీర్ప నుల్లాసియయ్యెను.

తెలతెలవారునంతట శివాజీ గుఱ్ఱము నెక్కి సేవకులు పదుగురు వెంటరాగాఁ బోవుచుఁ గొంత మేరలో మావళా భటులఁ గాంచి వారి మొగము లందు గెలుపు సంబరము గన్పడమి తొట్రుపాటుతో జయ మెవరిదని ప్రశ్నించుచు—కలయఁబరికించి "తానాజీ కానుపింపఁడు; ఏఁడీ" అను నంతలో నందలము వెంట వచ్చుచున్న సూర్యాజీ వినతుఁడై

"దేవా! అన్న-విరోధులను హతమార్చి"............అని నిరుద్ధకంఠుఁడయ్యెను.

"——హా, తానాజీ గతించెనా? శాత్రవులఁదునిమి, తునుమాడించి నాతానాజీ గతించెనా?"

అని ప్రేమభాండమగు తనగర్భమునుండి తొనఁకి కనుల దిగజాఱు నశ్రువులతో వారువము దిగి తానాజీని డాసి పై ముసుఁగుఁ దొలగించెను. గాయములనుండి కారి, అట్టలు గట్టిన నెత్తుటిలో మునుఁగు శరీరము, వాలుమూఁత కందోయి—పండ్లచే పెదవి నొక్కిన పట్టు తొలఁగఁబోని వీరముద్ర చూచి శివపతి హృదయము ద్రవింపగా వెచ్చనూర్చును.

"—నాచేతి చంద్రహాసము జారిపడినది. నావజ్రకవచము ప్రీలి

పోయినది. సింహగడమునందు గడము మాత్రము చిక్కినదిగాని, యీ కుడిభుజమువలె సింహముపోయినది. ఇంతటిధీరమూర్తి విటులఁ గనులు మూసితివా? తానాజీ! నిన్నుమ్రింగ దైవము నన్నిట్లు ప్రేరేపించునా? అన్నా! నీవు నాకింతలో దూరమగుదువని తెలియనైతినిగదా? బరువుదించి నిశ్చింతుఁడవైనట్లు నిద్రించుచున్నావా? నాకు బదులీయవా? పారతంత్ర్యమునఁ జిక్కి క్రుంగునట్టి భారతోద్ధరణోద్యమమునందు నా నాయకత్వమును వరించి, ధన—బల—జీవితములను ధారవోసి, రణరంగముల నంగరక్షకుఁడవై నన్ననుసరించుచు పెక్కు దుర్గముల బలిమిని సాధించి అనుచరుఁడు—అంగరక్షకుఁడు—సేనాపతి—బహిః ప్రాణము అనఁగా నన్ను సేవించు నిన్ను గోలుపోయినపుడు తానా! యిఁక నేను గోలుపోవని దేమున్నది? నన్ను ఒంటిజేసి యేగితివా? నాకొఱకై, లోకము మేలుకొఱకై త్యాగివై యోగివై నాకర్తవ్యము లన్నియు నీవేతీర్చి జయము నాకిచ్చి యున్నట్లే స్వర్గమును గొంటివా? ఈతపమును - ఈ యఖండ త్యాగము నేమందును. అన్నా! నన్నొంటిగా విడిచిపోవ నీకెట్లు కాలాడినది. ప్రతిభటుఁడయి మీఁదఁ బడుచు "బాజీ ఘోరాపటుఁడు" నాపయి కత్తి విసరునాఁడును, కపట పండితుఁడైన "అపజులుఖాను"తో ద్వంద్వయుద్ధము సేయు వేళను, "నయిస్తాఖాను" మేడపై నడురేయి పోరునడుపు నాఁడును, "ఔరంగజేబు" నన్నరికట్టు చెఱసాలనుండి యనువుగాఁ దప్పించుకొని సమయమునందును అడ్డుపడి - తెగించి నన్ను కాపాడుకొన్న ధీరుని బొగ్గుకై కల్పతరువువలె కుఱచ గడమునకై బలిగొంటిని. తానా! శివపతియెవఁడు? తానాజీ

మధురహృదయ బలమును ద్రావి వృద్ధినందిన భద్రమూర్తి. ఈనాఁడు నీవులేని శివపతి యెవఁడో? తండ్రీ! యెంతలోఁ బవలు; ఎంతలో రేయి పెండ్లికొడుకగు తనయుని ముచ్చటలు చూచు వేడుక నన్నుందజేఁసి— నాకనులయందు,మనస్సునందు నీవునిల్చి యానందముఁబొందనెంచితివా? ఇది ఎట్టి అభిన్న భావైక్యత!! అహ! యీమనేలయ తపమునకు నేనేమి బదులీగనేర్తును. పసుపుకుంకుమలతో, బాసికముతో, కరకంకణములతో నలరారు చిన్ని పెండ్లికొడుకు ఈ బెడపమున కెంత వెక్కి వెక్కి యేడ్చునో గదా? అతని కన్నుల కొలుకయందు మునిఁగి, బుగ్గల జాఱు కన్నీరు నాపై నొక దోసమును వ్రాయునేమోగదే? తానా! నీవిఁక మాఱు పల్కవు. ఈహృదయ బాధలు తీరెడు మార్గమును లేదు. నీ దీనకుటుంబ శోకాగ్నిని చల్లార్చు మార్గమును లేదు. నాపై దుముకు శాత్రవులను మట్టుపెట్టు తెంపునులేదు. తండ్రీ! నీవులేని కొఱఁత యెల్ల యెడల తానై యెంత వేధించుచున్నది. నాకీవంత తీరునదిగాదు. నీవుమాత్రము ధన్యుఁడవు. వీరస్వర్గమును గొంటివి. వీరభోగ్యముగ నేలుకొనుము.''

ఇట్లు శివ ప్రభువు తానాజీ మరణమునకు విలపించి యామహా వీరుని రణ వర్తనము సరయునెంచి సూర్యాజీతో నిట్లనెను.

''—అన్నా! సూర్యాజీ! అన్న కండగా నిలఁబడలేక పోతివా! కన్నులు విచ్చిన కాలరుద్రుని వైరులు పొట్టఁ బెట్టుకొన నెట్లునేర్చిరి? ఆపన్నుఁడై తానాజి నిసుఁజీరెనా? నన్నుఁ దలఁపలేదా? అట్లేల యగును! మిన్నులు విఱిగి మీఁదఁబడినను తా నొరులసాయమర్థించునా? యుద్ధ

మంతయు తానొక్కఁడేనడిపెనుగాదా? వెంటనే మావళా భటులు దూక లేదా? నీవచ్చట లేకపోతివా? ఆ ద్రోహాత్ములు దొంగపోఁటు గొనిరేమో? ఆ మహాబాహుని చుట్టుముట్టి యలయించిరేమో? సూర్యాజీ! అన్న ఖండన తాండవ మెల్లు సెల్లినది?—”

సూర్యాజీ తరఁగలాడు కనుఁగవనొత్తి, మెత్తని హృదయమునఁ జేవలెత్తి, మొదటనుండి కుదివాక తానాజీ రణగాథను ప్రభునకు నివే దించి యిట్లువాకొనెను.

“—ప్రభూ! నీ తానాజీ ధన్యుఁడయ్యెను. స్వీయ దేశమాతనర్చిం చుచు, ఆ పూజలో తాను మకరందము వలె స్రవించి పోయెను. తన ధర్మమును స్వామి సేవా ధర్మమును తానాజీ నిర్వర్తించెను. ఇది స్వాభావికము. మీ మెప్పును, సఖ్యమును, బాంధవ్యమును బడసి తీయని మీ లోన కఱఁగి పోవుటే యాతని ధన్యత్వము గాక మఱేమున్నది. దేవా! వెఱగుపాటు వలదు. శాత్రవుల హతమార్చి సూర్యమండలమును జీల్చుకొని వీర వేదికపైఁ గొలువున్న తానాజీ హృదయమునకు మీ నెచ్చని యూర్పు సోఁకిన నాతఁడు కళవళ పడును. దేవా! అతనికై మీరను తపింపవలదు: మీ హృదయ ప్రసన్నతలోఁ బులకింపని లోకమున్నదా? మిమ్మొక పలుకు బలుక నోరున్నదా? మావళాజగమును గాపాడ చక్ర ధరుఁడ వైన నీ విన్ని తలఁప నేల? మనసిచ్చి మమ్ముద్ధరింపుఁడు మా ప్రభు భక్తి పోయిన యన్నతో నమసి పోఁబోదు. మావళుల నిసర్గ ధీరత నశింపఁబోదు ఇఁక పెక్కూహలేల? మహాత్ముఁడగు' నన్నను బ్రతీ

కించుకోలేము గాని, మీ మది చిక్కఁబట్టుట కెటులైన మా ప్రాణముల సర్పింతుము. తానాజీ పైనున్న మే మనసును అతని బిడ్డపై నిల్పి, నాపై వారి సమస్త బాధ్యతలు మోవఁజేసి మన్నింపుఁడు. మావళా బలఁగము తోడుగా నెంతటి పని నైనను సాధింతును."

సూర్యాజి యుదాత్త మధుర వననములు విందైకుందువారింపఁగా శివాజి కలఁకఁదేఱి

"——అన్నా! నీపలుకులు హృదయమును పులకింపఁజేసినవి. ప్రభుభక్తియందు ఆ యన్నకు వన్నెఁ గూర్పగల తమ్ముఁడ వన్న విఖ్యాతితో నన్నును, అన్నను, దుర్గమును గెలిచితివి. ప్రళయభయంకర మైన పట్టున అన్నగతించి మావళాబలము విచ్చి శత్రువులు పైకొని అంపులుసేయు వేళయందు ముందుకు దూకి యోటమిని గెలువుగమార్చు నిన్నుఁ జూచు కొలఁది కనులు మిఱుమిట్లు బోవుచున్నవి, బాహుబల మును మించు, ప్రతిభాబలము, భక్తిని మించు రక్తికార్యోత్సాహమును మించు నిర్వాహణశక్తి నీయందు విలినమైనవి. అన్నబాధ్యత రెల్ల నీవే శేషుని వలె వహింపుము. నేను సుఖముగ నీపై విశ్రమింతును. నెత్తుటి పొత్తులో రగులుకొన్న దుఃఖాగ్ని తాపమును నీకు నీవే యోర్చుకొని, నా చిత్తమున కూరటఁగల్పించిన ధీరుని నిన్నే మని కొని యాడుదును? ఉత్తలపాటునందు కుటుంబము నోదార్చి, తానాజీ యుత్తమలోక క్రియల నాచరింపుము. సమస్తమును చల్లబఁబఱుపుము."

అని శివప్రభువు పేర్మి పెల్లుబకఁగా వచించి యనంతర క్రియలు

దీర్ఘ జతనము నడిపించెను. పిమ్మట తానాజీ పుత్రుని పెండ్లి వేడుకను కన్న తలిదండ్రులను మఱపునకుఁ దెచ్చుచు పెండ్లి పెద్దయై నిర్వహించెను.

శివ ప్రభుని మనసునందు చిగురొత్తు ఆశ్రితజనానురాగమునకు మావళా జగము మురిసిపోయెను. ప్రకృతి వర్గము సంబరము నందెను. కీర్తి వల్లికలు దిక్కీమల కెగఁ బ్రాకెను.

మంగళం

# పరివర్తన

ప్రమారమి రెండువేల యేనూతేండ్లకు ముందు భారత భూమిలో జరిగినగాథ. జైన మతకర్తలలో ఇరువది మూడవవాఁడగు పార్శ్వనాథ తీర్థంకరుని తరువాత ఆ మత బోధామృతమును వెల్లిఁగొల్పిన మహాత్ముఁడు వర్ధమానుఁడు. వైశాలినగరమునందు—సుప్రసిద్ధ క్షత్రియ వంశమున జననమంది కాంక్షాబంధముల తెగఁగోసి చిరకాల తపమొనరించి సత్యమును సందర్శించి—జీవకారుణ్యమును, ప్రేమతత్త్వమును అహింసాసిద్ధాంతమును చాటి. ఆత్మశాంతిలేక యల్లాడు జీవకోటి నుద్ధరింపనితఁడు బయలు వెడలెను.

శిశునాగ వంశజుఁడైన బింబిసారుని యేలుబడిలో మగధసామ్రాజ్యము సర్వతోముఖ వికాసమందినది- భారత కాలమున బార్హ ద్రథుడఁగు జరాసంధుఁడు దానినేలెను. గిరివ్రజము దాని కానాఁటి రాజధాని. అటుతరువాత శిశు నాగులు మగధనేలిరి. వారిలో యశస్తిలకుఁడైన బింబిసారుఁడు రాజగృహమును ముఖ్యపట్టణముగ చేకొని పాలించెను.

అట్లు స్వీయమత సిద్ధాంతములఁ జాటుచు బయలు వెడలిన

జినుఁడు రాజగృహపురికరుదెంచెను. ఆనగర శృంగాటకమున నిలిచిన ఆమహాత్ముని దర్శించి తరింప వేలకొలఁది జనులు గుమిగూడిరి. కరుణా తపస్వి వర్ధమానుఁడు వారినిగని యిటులనెను.

“అయ్యలారా! విషాద వీచికలతో కల్లోలిత మగుచున్న సంసార సాగరమునఁ బడి అంగలార్చు మీరెన్నఁడు ముక్తినందెదరు? యాతనా పథముల నడయాడుచు మీరెంత గాసిలుచున్నారు! ఒక్క మాటః ప్రేమించుట మానవ స్వభావము; ద్వేషించుటకాదు. హింసాప్రవృత్తి వదిలిన మీరెట్లు సుఖింతురు? ఆత్మాభ్యుదయార్థము దైవమునకు పశురక్త మర్పణఁగావించుచున్నారు. సకల జీవరాసులాతని సంతానమైయుండ నతఁడా కటిక నెత్తురు త్రావి మీకోరికఁ దీర్చుననియా మీనమ్మకము? వ్యాఘ్రాది వనసత్త్వములు క్రూరము లెట్లయినవి? స్వీయసంతానము నాహరించుట వలనఁగదా? అట్టిచో పసుల పీడించుకొని తిను మానవు లెంత దుష్టాత్ములో నించుక ఆలోచింపుఁడు! వెన్నంటి వచ్చు మృత్యువును దలఁపక, చావనివారివలె, నకృత్యము లాచరించు చున్నారు! ఎంతఅమాయికులు మీరు! జనన మందిన ప్రాణియెటులైనను మృత్యు వక్త్రకుహరమునఁ బడకతప్పదు. ఈ జీవజగతిలో శాశ్వతమేది? ధనధాన్యములు, పుత్ర మిత్ర కళత్రములు—నిత్యములు, సుఖాపాదలను మూఢ విశ్వాసమును వీడి, అస్తేయము, అహింస, శౌచము, మున్నగు ధర్మపథముల నడచి, అవ్యయము, సుఖదమునగుసుభగ సీమలో విశ్రమింపరండు. కాంక్షాసూత్రబద్ధులైన మీరు, సత్యమును సందర్శింపలేరు. పట్టుపాన్పుల

పయిఁ బరుండు నగ్రమాట్టునకును, కటికినేలను బన్నుండు పేదకును జీవితమున నంతరముకలదు కాని, సమాధియందు లేదు. కాఁటితల్లి వారిరువురను సమదృష్టిని లాలించును. ఆయమకు పాక్షిక దృష్టిలేదు. ఇతఁడు రాజని, ఇతఁడు సేవకుఁడని, ఇతఁడగ్రకులజుఁడని, ఇతఁ డధమవంశజుఁడని యేల భేదభావముల నొండొరుల చూచుకొందురు?"

—మధుర మధుర సాంధ్యరాగపూరము వెలార్చునంబర మంతలో కాఱుమబ్బుల కప్పబడినది. జడివాన కురియు చున్నను, ఇంచుకయుఁ జలింపక సుడిగాలిలో నాఱిపోని మణిదీపమువలె వెలుఁగొందుచు నల్లె ధర్మబోధను జైనమతాచార్యుఁడొనర్పసాగెను. పంచేంద్రియ వ్యవహార మును విస్మరించిన జనసమూహము కుడ్య చిత్రసందోహమును తలఁపు నకుఁ దెచ్చినది. కాంతాకటాక్ష సుధావీచికలఁ దెప్పలుగఁ దేలిపోవు రాజన్యులెక్కడ? తత్త్వ బోధనలవినుటెక్కడ? ఆహా! యేమి! భగవానుని మహిమ! బింబిసారసార్వభౌముఁడు అబోధామృతమును తని వారఁ ద్రావుచు నర్ధాంగలక్ష్మి కోసలాదేవితోఁబాటు విశ్వమును విస్మరించి నాఁడు. అంతంత కారుచీఁకటులు దెసలగ్రమ్మసాగినవి. జనము స్వీయగృహోన్ముఖము కాఁజొచ్చినది. ఆచార్యు ననుజ్ఞ వడసి ప్రభువు సహధర్మచారిణితో భద్రగజాధిరూఢుఁడయి బయలు వెడలెను. ప్రియునినోట వర్ధమాన తీర్థంకరుని మహాత్మ్యమును విన్నది కావున తన మనమున నాతని నిలుపుకొని తత్పునీత చరితమును స్వాంతవల్లకీ తంత్రులపై పాడుకొన సాగినది. ఆమె నోచిన నోమెట్టిదో కాని అదినుత భగవానుని దివ్య జీవితగాథను స్మరింపని లిప్తయేలేదు.

# ప రి వ ర్త న

## ౧

అది మధుర నిశీధిని. గగనము క్షీర సముద్రమువలె మంజులమై నయన సుభగముగ నుండినది. తారకలు సాగర గర్భాంతర మణులట్లు వియత్తలమున మినుకు మినుకు మని మెఱయుచు తీయదలఁపునవల విరఁ బూయించినవి. సత్త్వగుణ పూర్ణుని విశుద్ధ హృదయమువలె నిర్మలమై, శాంతమై ప్రకృతి భాసిలినది. గంగా తరంగిణీ తరంగముల నుండి కదలివచ్చు కమ్మని పిల్లదెమ్మెరలు 'హాయి' యనిపించినవి. సౌధోపరి తలమున సమర్పఁబడిన శయ్యపై బింబిసారమహానేతయును, అతని పట్టమహిషి కోసలా సతియును శయనించిరి. కొంత ప్రొద్దేగినది. కోసల మైమఱచి నిదురఁజెందినది. జనపతికి నిదుర రాలేదు. ఆలోచనాపరుడై యతఁడటులే మేలుకొని యుండెను. ఉన్నటులుండి ఉలికిపడి కోసల "——అతఁడీ రాత్రి నెటులఁ గడపఁగల"డని కలవరించినది. ఆ పలుకు లాలకించిన నృపాలుని గుండె జల్లనినది. అతని మనో వీధిలో కోటి యూహలు విలయ నర్తన భంగిమలు నెఱపినవి. కట్టకడ కతని మానసము దుర్మార్గమునఁ బడిపోయినది.

"నన్నిలువేలుపువలె నమ్మికొనుచు సౌహార్దవతియైనచో నిది యిట్లేల కలవరించినది? కోసలా! నీవెంత ఘాతుకురాలవు ఎంత నివురుగప్పిన నిప్పుకవు! నేఁడుగదా నీబ్రతుకు బయటఁబడినది. ఈ నీ కశ్మల భావము నిన్నినాళ్లెట్లు దాచియుంచఁగలిగితివి? అయ్యో! అనుఁగుఁజెలులందరిలో నన్నధికముగ నంభావింతుగదా? నీ దయాభిక్ష కంజలిసాచు నొక్క

చక్రవర్తికి అర్ధాంగలక్ష్మివి. అయ్యేను, పాపశంక విడచి అనురాగ వల్లరిఁ త్రుంచి వైచుటకు నీ మనసెట్లొడఁబడినది. ధర్మమించుకయుఁ దలఁపఁ పుత్రవతివైన నీకీ దారుణకృత్యమొనర్ప బుద్ధి యెట్లుపుట్టినది? కుఁ కాంతవని నిన్ను విశ్వసించి చెడితిని. పుణ్యసతీ ప్రవర్తన లిట్టివేనా?

దవాగ్ని కీలలచే దారువు రూపఱినటుల నా గౌరవమంతయు నీ మూలమున నశించి పోయినది. నీవు నా హృదయమునకు బల్లెమవుదు వని కలనైనను తలఁచిన పాపమునఁ బోలేదు. పాపాత్మురాలా! యాశైశ నాగుని కీర్తిచంద్రికకు కారుమబ్బువైతివి. నేనెట్లు సాటి రాజులలో తలయెత్తుకొని తిరుగుదును. కానిమ్ము. దుష్టమతులు వసింప నాయీ పుణ్యభారత వసుంధరలో కడకు జేనెడు చోటునులేదు. ఈ నాటితో ఈ ప్రపంచమున నీకు శతాయువు నిండినది.''

బింబిసారుఁడు నిద్రించుచున్న కోసలను పిడిబాకుతోఁ బొడువ గమకించెను. కాని, అతని మనసు చలించినది. మరల వాని మనోసాగరమున నొక భావ తరంగము తలసూపి యింతకు ముందటి తలఁపు తరగఁను అణఁచి వైచినది.

''వైరి వరూథినీ శిరోధులను తెగనఱకు ఈ ఖడ్గధారచే అబలను, అ...గిని, నిద్రాపరవశురాలను దునుముట ధర్మమా? కరుణ దొలఁగి ...న నఱికినచో ''ఈ నృపుఁడెంత కిరాతుఁ''డని లోకులు వేనోళ్ల నను ...దురా? అటులని యీనింద్య చరిత్రను హతమార్పకవిడుతునా?

దీనిని సమయింపక నా కన్నపానములు రుచించునా? కడకు కంటి" కూరుకు వచ్చునా? ఇంతయేల! నంవానతీ తనయుఁడు "అభయునికి నాకు కూర్చుకొడుకు నామాట జవఁదాటఁడు. అతఁడే యీ విష కంటక మును మార్గమునుండి తొలఁగింపఁజాలడు. వాఁడే యీభూపతి యుకీర్తి కేతువును నిర్మూలించఁ గలఁడు.

———కోసల ఎట్టిదో రాజునకు తెలియదా? ఆయమ హృదయ మెంత విశుద్ధ మైనదో అందు వసించు నృపున కెఱుక పడక పోయినదా? ఆ సతి అనల కల్పిత విగ్రహమని ప్రజ వేనోళ్ల వినుతించుటలు ప్రభుని చెవికిఁ దవులక పోయినవా? అహెూ! కాల మహిమ! దానిఁ గడవ నెవరి వశము!!!

## 3

"అభయా! అప్రమత్తుడఁవై యీ పని ముగింపుము పొమ్ము."—

బింబిసారుఁడు అభయునటు లంపి వేఁట నెపముతో కోట గవను వెలువడి కొంత దవ్వరిగి నిలిచెను. ఇప్పు డాతని హృదయయోద్వేగము కొంత శాంతించినది. సత్యాసత్యములను, ధర్మాధర్మములను, వితర్కించు కొనుటకు కొంత తావాతని హృదయమున నేర్పడినది.

"అనతిగాఁ దలఁచి కోసల ప్రాణముల బలిగొనుట కామే రాణీ వాసము నిర్ధగము నొనరింప నభయు ప్రేరేచి పంపితిని. ఇంతకును ఆ కలవరింతకు హేతువు నరయ నైతిని. ఇన్నిటికిని ఆమె నిర్దోషురాలేమో—

సందియ మెందులకు? ఈ వేణువనమున నివసించు జైనభగవానుఁడు త్రికాలవేది. ఋజుతాహితాత్ముఁడు. ఆ మహాత్ముఁడీమె శీలము చెప్పును గాక. అతని సంప్రశ్నించి సంశయమును బాపుకొందము.—"

బింబిసార మహీనేత పరుగుపరుగున వేణువనమునకరిగి భగ వానుని సన్నిధానమున దోయిలించి నిలిచెను. నేత్రాని కనుక భగవానుని పదనారవిందములకు కించి దరుణ రక్తిమను దిద్దినది.

"రాజా! యింత అధీరస్వాంతుఁడవైతి వెందుకో? ఆయమ శీలమును శంకించి ఆమె జీవయాత్రను ముగింప నెంచితివా? అంతటి పతివ్రతా మణి యీ వసుంధరయందు కలుగఁబోవునా? పరమోపకార తత్పరుఁ డొకఁడు ఒకరేయి వర్షమునందు వడు బాధను కనులారఁ జూచి యుండుటచే నామె యట్లుకలవరించినది. ఆ మహాసతి నే దోషము లంటఁగలవు? ఇంచుక చల్లఁదనమునకు తావిచ్చి కనుల దెఱచి యోజించినచో నిజము నీకే తెల్లమగును. ఇంతకును నీవు ధన్యుఁడవు. నీ కీర్తి కాలవాలమగు నా పుణ్యవతి యిఁక నీకేమి దక్కునో? పొమ్ము."

—ఈ మాటలు విని నృపతి గడగడ వణఁకిపోయెను. పాడువడిన స్థూపమువలె నాతఁడు నేల కొఱఁగిపోయెను.

"ఆహా! యీ మహాత్ముఁడానాఁడు వర్షమున పడు దురవస్థను తాను కనులార గాంచినదగుటచే నా విభుని కలవరించినది. మోహ భ్రాంతుఁడను నేనా సంగతిని జ్ఞప్తి కెలయించుకొన లేకపోతిని. ఇఁ

కెక్కడి కోసల! ఇకెక్కడి జీవితాశ! ఈ ఘోర పాపము నన్నూరక విడుచునా? ఇహపర విదూరుఁడనైన నాకు మంచిదినములు వచ్చునా?"

—అశ్రుజల కశ్మలమగు నయనములతో నాతఁడు వెనల పరికించుచు సాగిపోవ కాళ్లాడక—ఆగలేక యెటులో అంతిపురమును సమీపించెను.

కలుష మృత్యు జిహ్వాకలవలె అనల కీలలు విలయ తాండవ విలాసము చేసెఁ గొనల నతీ పాపమును నిలువున దహింపసాగినవి. జనులు పిట్టలట్లు హర్మ్యము చుట్టును మూగి కుయ్యాడఁజొచ్చిరి. ఆకాశమునంటుచున్న ఆ వజ్రజాలమేడ చూచు చుండగఁనె కాలిపోయి కూలిపోయినది. యింతలో కణ్ణచే కొట్టఁబడిన కోఁడె త్రాచువలె బుస కొట్టుచు కోసలాదేవి కుమారుఁడు యువరాజు "అజాత శత్రువు చతురంగ బలములతో నటకు వచ్చినాఁడు". విలయ మేఘగర్జలకు పై చేయి యనదగు కంఠస్వరముతో నిట్లనినాఁడు.

—"అభయుఁడెక్కడ? ఏఁడీ ఆ మాతృద్రోహి! వాఁడెందుఁబోయినను పట్టి హతమార్చక విడువను. సవతియని నందానతితో వాదులాడబోడు. సవతి కొడుకని తన్నెక విధముగాఁజూడఁబోదు. నావలె వానినిఁగూడ మన్నించు పరమసంభావ్యచరితను చంపఁదలపెట్టిన ఆ నికృష్టాత్ముఁడేడీ? ఈ మహాగ్ని కీలల కాహుతి గాక ఎటులో నసుఁగన్నతల్లి బ్రతికి బయటఁ బడుటవలన సరిపోయె. లేనిచో నామెనిఁక నీ భూగోళమున చూడలేముగదా?——"

ఈపలుకులు చెవి బడఁగానే బింబిసారునకు పోయినప్రాణములు వచ్చినట్లాయెను. భయ విషాదహర్షములు ముప్పిరిగొన్న యెలుఁగుతో నతఁడజాతశత్రువున కిట్లనెను.

"తండ్రీ! అభయుమై నలుగకుము. దీనికంతకును కారణమునేనే. నీకోపాగ్ని కీలలనన్ను భస్మసాత్కృతునిఁజేయుము. నాకీ ప్రపంచమున నిలువ నిఁక తావులేదు. నాపాపములు బాగుగపండినవి. నీ కరవాల మునకు నాయనా! తలనెడ్డుచున్నాను. నన్నింకను జీవములతో నిలిపి కుమిలింపకుము.

అజాత శత్రువు భగ్గున మండిపడెను.

"అయ్యో! దుష్టుడా! నీవేనా యీ ద్రోహచింతకు నడుము గట్టినది? నిన్ను కడికండలు చేసినను దోసములేదు. నీయడుగు జాడల ననున రించు పుణ్యవతి నాతల్లి నిట్లు జంపఁదలకొనుటకు ఆయమ యెట్టి నేరము నొనర్చెనో ముందు చెప్పుము? అంతిపురమునకు వెలకాంతల రప్పించుకొని ప్రొద్దుపుచ్చు చుండుటలు తెలిసియు గురుఁడని సహించి తిని. అర్థధర్మ పాలనమునకు నీవనర్హుఁడవు. లజ్జలేక యీపనికెట్లు తెగించితివి? జనకుఁడని, సమ్రాట్టని, నిన్ను మన్నింపను నీ వొనర్చిన యీ దురంత పాపమునకు నీవు శిక్ష ననుభవింపవలసినదే. చెఱసాలలో అన్నపానములు లేని కక్కుఱితి చావునకు గుఱియై నశింపుము.——"

చైతన్యావశిష్టుఁడైన బింబిసార మహానేతను భటులు చెఱకుఁ గొని పోయిరి.

## ౪

కోసలాసతి తన ప్రాణపతిని తనయుఁడు చెఱసాలఁబెట్టించుట విని నిలువున కూలి పోయినది. మూర్ఛ మునిగి యున్న రాణిని సేదఁ దేర్చు టలో చెలులు నిమగ్న లైనారు, రాణీ కొంత వడికి తెప్పిఱిల్లినది. దురంతవేదనా తాపమామె మాననమును కలఁచ సాగినది. పతిదేవుఁడు తన్ను మున్నెన్నఁడునుఁ బల్లెత్తు మాట కూడా అని యుండలేదు, నేఁ డకారణముగ తనహర్మ్యము తగులఁబెట్టించుట కామె కారణము నూహింప లేక పోయినది. ఇది యిట్లని ఆమె కెవరు చెప్పెదరు? ఈకథ ఒరుల కేమి ఎఱుక! తనయుని దుందుడుకునకు చెప్ప రానంతగా తపించినది. వానిపై శాప విషాక్షరములఁ గ్రుమ్మరించినది. నాథుతో తనకి నాఁటివరకును సాగిన మధుర జీవయాత్రను తలఁచుకొని తలఁచుకొని పలవించినది. విభునిపాద పద్మముల ' చెంత నివసించుచు కడతేరు భాగ్యము తనకు కలుగునా యని యెలుఁగెత్తి యేడ్చినది. ఇంతలో తనయు నడుగుల చప్పుడైనది. వెంటనే రాణి నేల కొఱగినది.

వాత్సల్య సుధారసార్ద్రము లైన కటాక్షములతో మన్నించుచు వత్సా! యని నోరారఁ బిలుచు అమ్మ నన్నుఁ జూచినంతనే మూర్ఛఁ జెందినది. తన పతిని కారాగార బద్ధునొనరింతినని తిట్టదుగదా?''

ఇట్లనుకొనుచు అజాతశత్రువు తల్లిని సమీపించెను. కోసల కను విచ్చి కంపిత స్వరముతో నిట్లనినది.

మంటలో నుసియైపోయినను—“దుర్మార్గుఁడుచచ్చెను, భూభారము తీరి పోయినది—” అని లోకమానందించునే గాని నా పాటున ‘కయ్యో’ యని కడకొక కన్నీటిచుక్కయైనను విడువదుగదా? కనులఁగ్రమ్మిన రాజ్యమద తిమిరములో ప్రపంచమును గానక యిచ్చ వచ్చినట్లు తిరిగితిని, ఒక నాఁడును పున్నెపుఁబాటలో కాలిడనైతిని. ఎంత నికృష్టుఁడను. కట్ల కొట్లఁబడి గాసిలియును మధుర క్షీరము లొసఁగు గోమాత వలె నేనుపెట్టు బాధల నెల్ల నోర్చి నన్నానందాబ్ధి నోలలాడించు ననుఁగుఁ జెలిమి సమ యింప నడుకట్టిన పాపనిశ్చయుఁడను. నాకీ జన్మలో బంధన విముక్తి కలుగునా? అయ్యో! నోటికందిన అమృతపాత్రికను బోరగిలఁ ద్రోసికొన్న మంద భాగ్యుఁడు ఈప్రపంచమున ప్రభవించినది దుఃఖము ననుభ వించుట కేమో? దేవీ! నిర్భాగ్యుఁడను. నాదోసము నీవుగాక మఱెవరు మన్నింపఁగలరు? తప్పు సైచితిననుము, నీపాదములకు ప్రణామములు. ఇది యేజన్మ తపః ఫలమో! నీవంటి యిల్లాలు అర్ధాంగి యైనది. పరమ సతీమణిని భార్యగాఁబడసియు, ఆమె చేయు సేవనందియు—కడకామె ప్రాణములకే యెసరు వెట్టిన రాక్షసుఁడు భూభారమై మానవాకృతి నేల జన్మించెనో? ఏయడవి యందో మ్రానై పుట్టిన నెంత బాగుగ నుండెడిది? అనపరాధకు ప్రాణదండనమును విధించు పాతకుఁడు కృపాభిక్షకపాత్రుఁ డని యా నీవుపల్కునది? వద్దు; వద్దు. కోసలా! ఆ మాట మాత్ర మన వద్దు. నీవు దయతో మన్నింపకున్న నిఁక నన్ను జాలితోఁ జూచువారెవ రున్నారు? కాన, నీ వా మాటన్న నిజముగ నేను జీవింప లేను. ఇట్టి కఠోరహృదయుని నిర్లక్ష్యముసేయక యిన్నినాళ్లెట్లు ప్రేమించితివో?

ఇఁకనైన నాపాపమును విస్మరించి జీవిత శేషము నేటులో ప్రశాంతితో గడపుము. ఇంతకును ఒక్కటే దిగులు. నేను నమసిపోవుచున్నందు లకుఁగాదు; నిష్కారణముగ నీకు ద్రోహమునుఁ తలఁపెట్టినందులకు—"

వలలోఁబడ్డ విహంగమువలె ఉరియాడుచు నిట్లు రాజు పరిపరి విధముల విలపించెను.

౬

పూనీఁట మునిఁగి పుష్పాది దుకూలములు మొలఁదాల్చి అళి యోగి వ్రజములు త్రయీ మయితనుఁడగు లోకబాంధవుని అష్టలితామోద రసాప్తికి ఝుంకా రోంకృతుల వేకుప నర్చించినవి.

పసి పాపఁడగు దర్శకుని తొడపైఁగూర్చుండ బెట్టుకొని అజాత శత్రువు ముద్దు లిడుకొన సాగినాఁడు. చెంతనే యాతని సహధర్మ చారిణి పద్మావతియును, తల్లి కోసలయు నుండిరి. ఇంతలో దర్శకుఁడు మూత్రధారలను తండ్రితొడపై విడచెను. చెంతనున్న తల్లినిచూచి అజాత శత్రువు "—అమ్మా! లోకమునందు ఏ తండ్రియు వానిబిడ్డను నావలె పరమవాత్సల్యముతోఁ జూచుకొనునా? అని ప్రశ్నించెను. ఆ పలుకు లామె హృదయమును కలఁచివైచినవి. వెనుక నడచిన గాథ ఆమెకనుల ముందట నిండు చైతన్యముతోనర్తించినది. నయనములనుండి జాల్వారు నశ్రువులను దుకూలాంచలమున నింకించుచు నామె యిట్లనియెను.

"—నీవు పుట్టినప్పుడు దైవజ్ఞులు నీవు ప్రాణవిరోధి వౌదువని నీ

తండ్రికిచెప్పిరి. అందు కతఁడు భీతిఁజెంతలేదు. నా బిడ్డఁ డజాత శత్రుఁడగునని పరను విశ్వాసముతో, కోర్కు లిగురొత్త పెంచినాఁడు. కాని నన్ను మాత్రము జోస్యులు చెప్పినమాట మిన్నకుండనీలేదు. అత నికి నీవు మారకుఁడవగుదువన్న భయముచే ఆ యశోక వనమున విడచి వచ్చితిని. ఇది యెఱిఁగి నీ తండ్రి "అయ్యో! దైవజ్ఞులమాటనమ్మి కన్న బిడ్డను కాన పాలుజేసివచ్చితివా?" అని నాపైమండిపడి, అప్పుడే వనికేగి నిన్నుఁదెచ్చి "చంద్రునివలెనున్న వీనిని అశోక వృక్షవాటికను విడచి వచ్చుటకు నీ మనసెట్టులొప్పె"నని నీ కానాఁడు అశోకచంద్రుఁడని పేరు పెట్టెను. మఱొక్క సంగతి. నీవు ఆటలాడుకొనుచుండఁగా పిచ్చికుక్క నీ కాలివ్రేలు కఱచినది. రక్తము చిప్పిలసాగినది. జనము గుమిగూ డినది. ఎవ్వరేమియు నొనర్పనేరకుండిరి. ఇది తెలిసి నీ పితృదేవుఁడు పరుగు పరుగునవచ్చి విషరక్తముచిందు నీ వ్రేలిని చీఁకినాఁడు. తన ప్రాణములు పోవునన్న భీతియు నాతనికి లేకపోయినది. అట్టి నీ జనకుని, నీకు ప్రాణదానముచేసిన నీ గురుని—కరుణమాలి చెఱనిడి, కడుపుమాడ్చి చంపుచు నీ కొడుకును బుజ్జగించుకొనుట గొప్పగనెంచి వదరుచుంటివి. అట్టి కడుపున నిట్టి ఘాతుక మృగము పుట్టినది. నిన్ననఁబనిలేదు. ఇది యంతయు నేను నోచిన నోముఫలము—."

పద్మావతిభర్త చేసిన పనికి లోలోన కుమిలి పోయినది. పసి పాపఁడగు దర్శకుఁడు నయితము కెవ్వుమని యేడ్చినాఁడు. అజాత శత్రువునలమిన మంపుఁదెరలు విడివడిపోయినవి. తండ్రి ప్రేమయెట్టిదో అతని కర్థమైనది. అతఁడు బాలునివలె వెక్కివెక్కి యేడ్చినాఁడు. తల్లి పాదములు పట్టుకొని విలపించినాఁడు.

## ప రి వ ర్త న

"అమ్మా! యీసంగతి నిన్నాళ్లుగా నెందులకు దాచియుంచితివి. నా పాపములు బాగుగ పండుటకేనా? తల్లీ! నే నెంత కష్టాత్ముఁడను. దోషములు నన్ను ధర్మచ్యుతునొనర్చి నా చేత నీపని చేయించినవి! తీరని దుఃఖసాగరమున ముంచినవి. పతితుఁడనైతిని. నా తపఃఫలమైన తండ్రిని బందిలోనిడి మాతృదేవతను నిన్ను గోడుపెట్టితిని. నా దోష ములు మన్నింప తండ్రి యడుగులపైఁబడి ప్రార్థింతును. పునీతమగు నీ క్షితిని మరల నాతనికే సమర్పింతును. ఈ గదతోనేగి చెఱసాల కవాట ములను భేదించి నాతని గొనివచ్చి యీ సమస్త వసుమతీ సామ్రాజ్యమున కభిషిక్తుని గావింతును. అమ్మా! క్షమింపుము. ఇంకను బ్రదుక నిచ్చ గించు చుంటినిగాన శపింపకుము"—.

పతి నిర్బంధము బాయునను దృఢవిశ్వాసము కోసలకుఁ గలిగినది. భర్త మనసు మారినందులకు పద్మావతి హర్షపరవశయైనది. గదగొని అజాత శత్రువు కారాగారమునకుఁ బరువిడ సాగెను. తనపాటున కంగ లార్చుచు ఆఁకటిమంటకు క్రాఁగిపోవుచు పిచ్చివానివలె చెఱలో నటునిటు గ్రుమ్మరుచున్న బింబిసారుఁడు బంధన జాలకములనుండి తనయుఁడు గదతో చెఱవైపునకు పరుగుపరుగున వచ్చుట పరికించి చూచినాఁడు. ఒక్కపరి హీనస్వరముతో నాతఁడు వికటముగ నవ్వెను.

"——అంతయు నర్థమైనది. నే నిన్నాళ్ళు మరణింపని యునికికి వానికేదో సందియమొదవఁగా గదతో నా తలను మొత్తి చంపుటకు వచ్చు చున్నాఁడు. "తండ్రీ! నిన్నుఁజూచి యెన్నాళ్లాయెను! రమ్ము. బాహు

బలవిక్రమమున సాటిలేని యశముగడించి, సామంతరాజులొనర్చు సేవల నంది, ధర్మచక్రము చేఁబట్టి ప్రభుతనెఱపి కడకుఁ జోరునిరీతి బంది ఖానాలోబడియు ప్రాణములుఁ బాయలేని మానహీనునిఁజంప కన్నకొడు కునే ప్రేరేచి పంపుచుంటివా? విధీ! నీకు జోతలు, నీ ఆశయమే పూర్ణముగా ఫలించుగాక. అందఱకు నసహ్యమైనబ్రదుకు బ్రదుగుచు శిశు నాగవంశమునకు కళంక మాపాదింపలేను. నా చావుతో నా వంశము ప్రకాశింపగలదు. దేవీ! నా హృదయవేదన యింకొక లిప్తలో శాంతింపఁ గలదు. నామూలమున నీవు దిక్కులేని పక్షివయిపోతివి. ఈనికృష్టునిమీఁది యాశతో యెంత గానిలుచున్నావో? భగవానుఁడు నా పాపములనుసైచి నాకు మరల మానవజన్మ మనుగ్రహించునేని, నిన్నే అర్ధాంగిగాఁబడయ నంప్రార్థింతును. ఇది నీకు అంగీకారమేనా? ఇప్పటికి చాలునని యీాన డించుకొవుగదా? మా వంశమర్యాదను మంటగలిపి తనయుచేనైనను జావఁదగునా? నాకై నేనే మరణింతును——".

తనకడ దాచియుంచుకొన్న కటిక విషపుద్రావకమునుద్రావి ప్రభువు నేలగూలి మరణించెను. తండ్రిని గొనిపోవ గంపెడాసతో చెఱసాల ప్రవే శించి అజాతశత్రువు తండ్రిని దగ్గఱ అఱచి నేలఁగూలెను.

బింబిసారుని చితిమంటలో కోసలానందలు మఱఁగుపడిరి. అటు తరువాత నజాతశత్రువు తన ముఖమును ఆఱునెలలవఱ కర్ధాంగికిఁ జూఁప జంకినాఁడు. అతఁడు శల్యపంజరమైపోయినాఁడు. పాపభీతి యాతనిపట్టి వేధింపసాగినది. ఆత్మశాంతికతఁ డారాటపడఁజొచ్చెను.

## ౭

అది వెన్నెలరేయి. జిలుఁగుమబ్బుల నీలిచీరపైఁ దళుకొత్తు జరీబు టాలలాగున అంబరమున అనంతతారకలు మినుకుమినుకుమని మెఱయఁ జొచ్చినవి. రేవెలఁదికొప్పులో చెరివిన జాదిమొగ్గలవిధముగా నక్షత్రములు ప్రకాశించినవి. ఆరాజ గృహపురికి సమీపమునఁగల వేణువనమును బుద్ధ భగవానుఁడు తన పాదవిన్యాసములచే పవిత్రీకరించుటవిని ధైర్యకూల మును మాటిమాటికి కోయుచున్న మహోత్కట విషాదనదిని తరింపఁజేసి శాంతిభిక్ష ననుగ్రహించునని తలఁచి అజాతశత్రువు బుద్ధుని సందర్శింప వేణువనమునకరిగెను. కసాయికిఁగూడఁజాలినిబుట్టించు ప్రసన్నరేఖయు, సంస్మరణక్లేశ సముద్రమునఁబడిన జీవులనురక్షించు కరుణయును, తన ప్రాణములను బలిగొననుంకించు కర్కశునయినను పల్లెత్తుపలుకుఁ బలు కని పరమశాంతియు, కలికల్మష తిమిరమును బాఱఁదోలు బ్రహ్మతేజ మును ముఖమున నుట్టిపడుచుండగా శిష్యులకు బోధామృతమును బంచు చున్న జగదేకగురుఁడగు శాక్యసింహుని పాదములపై నజాతశత్రువు వ్రాలి యిట్లనెను.

"—గురుదేవా? ముక్కాలి ముదుకఁడగు తండ్రినివిడచి అర్ధాంగ లక్ష్మి మా తల్లి యశోధరాదేవిని వియోగమునకు విధేయనొనర్చి ధారుణీపాల కత్వమను పరాధీనవృత్తికి పెడమోమిడి, కంటకావృతములైన భయంకరా రణ్యములందు దేహము బడలిపోగా తపమాచరించి విషాదమగ్న మానవ కోటి నుద్ధరించుచున్న మీరు పాపాగ్నికీలల దగ్ధమగుచున్న నన్ను రక్షిం

పరా? ప్రభూ! నిన్నే నమ్ముకొంటిని. నీ పాదపద్మములను ఆమరణాంతము మఱువఁజాలను.

మా గురుపాదుఁడవు నీవుపక్క మఱెవరు నన్నీ పాపాబ్ధినిఁదరింపఁ జేయగలరు? సమస్త పాపములును నన్ను గులాముఁజేసికొని నాచే ధర్మాత్ముఁడగు తండ్రిని జంపించినవి. నన్నుఁగన్న తల్లులు నా తండ్రి ననుసరించిరి. "కొడుకా"యని యెలుగెత్తి నన్ను పిలుచువారిఁక నాకెవ్వరును ఈప్రపంచమునలేరు. ఉన్నవారిని చేఁజేతులఁ జంపుకొంటిని. నాకిఁక నరకమేనాగతి? పితృ ఘాతుక దుష్కృత్యమువలన నా పుణ్యములు నశించినవికదూ?

తండ్రీ! మమతలద్రోసి, మారుని మాయలగెలిచి నిర్వాణపథము నంటితిరి. దుఃఖసాగర నిమగ్నులై తెరువేది అక్రోశించు మానవులను రక్షించుటయేగదా ఇప్పుడు మీచేయువని. గౌతమమునీ! నేనలఁతిని నిను కొనియాడఁజాలను. భవభయవారకములైన మీ బోధనల నాలించుచు ఏచింతలేక మీ పాదములచెంత సుఖించుచున్న శిష్యకోటి పాదపాంసువేశమునకేని సరిపోలను. ద్రోహిని; కశ్మలాత్ముఁడను. నేనెట్లు సరిపోలఁగలను? దేవా? మీ హృదయము సముద్రమువలె అనవద్యము. మీ పుణ్యభావములు మబ్బులఁ జీల్చుకొని అంబరమునంటును. నన్ను పునీతునిఁజేసి మీ పాదదాసునిఁ గావించుకొనుఁడు. నయన నిర్వాణము గావించు, ఈ మీ మధురమూర్తిని సందర్శించుకొనుచు కాలముఁబుచ్చ

నన్ను అనుగ్రహింపుఁడు. నాకిఁక ఆలుబిడ్డలతోడను, రాజ్యముతోడను పని లేదు. నా జీవితము మీ చరణ సన్నిధానముననే గడచిపోనిండు—".

వెల్లువలై ప్రవహించు కన్నీటిచే బోదినత్తుని శ్రీ చరణముల నాతఁడు కడిగెను. భగవానుఁ డణమోడ్పుఁగనుల నాతని సమీక్షించెను.

"—అన్నా! చింతిలకుము. కాలసముద్రమునుఁ గడవ నెవరితరము? పాపములు నిన్నలమగా నది యట్లయినది. కడచిన గాథను తలఁపునకుఁ దెచ్చుకొని సంతపింపకుము. నిర్వికల్పమగు ధర్మతేజము నీ గుప్తతన మునుమాన్పి సుఖమునిచ్చుఁగాక!

తండ్రీ! సముద్రగర్భమున మాఁటువడిన రత్నములవంటి మహిత చరితలెందఱో యీ భూగర్భమునఁ గలసిరి. వారిలో మీ తండ్రియు నొకఁడు. చనిపోయినవారికై అంగలార్పకుము. రేపు నీవుమాత్రము నశింపకుండువా? చంచలమైన యీ జగతిలో శాశ్వతమేదియునులేదు. క్షణకాలములో నశించు మెఱుపుఁదీవలవంటి భోగభాగ్యములకు కలవరము తగదు. ప్రాణావసానమున అగ్నిసాక్షిగ పరిణయమాడిన అర్ధాంగియు ననుసరింపదు. వత్సా! యీ ప్రపంచమొక సత్రము. అనేకులు బాటసారులు ఎక్కడెక్కడనుండియోవచ్చి యిందుచేరుదురు. ముద్దుముచ్చటలతో కొంతతడవు ప్రొద్దుపుచ్చుదురు. కడకెవరిదారివారిది. ఒకరును సత్రమునంటిపెట్టుకొని యుండఁబోరు. తెలిసినదా నాయనా! యీ ప్రపంచ తత్త్వము. అట్లని నిరాశపడకుము. దేనిపైనను తీరని మమకారము తగ

దనిమాత్రమే నేనుచెప్పినది. కడకది దుఃఖకారణమేయగును. బలిమితో దుర్గమును సాధించువానికంటెను మనసును స్వాధీనమందుంచుకొను వాఁడు ఘనుఁడు. కావున ధర్మమార్గమునందు దుడుకుమనసును శాంతితో నడపుము. దయాసత్యములవలన చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తమొద వును. శాంతినందుము. చేసినపాపమున కెవఁడు పరితాపమొందునో వానిని ఆపాపమంటనేరదు. నీ హృదంతర దుఃఖతాపము శమించుఁగాక. నీకు అనంతహర్షము సంధిల్లుగాక!!

శాక్యపతి యిట్లు పలికినంతనే ఆ మహాత్ము నభినందించునదివోలె వేణునాదోక్తుల వనలక్ష్మి వెల్లివిరిసెను. గగనవాణి ప్రేమగౌరవమున సేన ముత్తెములను వర్షించినట్లు భగవానుని మస్తకముపై తుషారకణములు రాలినవి.

— మంగళం —

# కవితాప్రభావము

భోజమహీపతికి రాజధానియగు ధారానగరము సత్కవుల పెంపుడు తల్లి. భావమధురమగు పున్నమవెన్నెల నా నగరము ప్రశాంతముగ విల సిల్లినది. అది నిదాఘనిశీథము; పౌరులు సౌధోపరితముల అరుబయలు పవళించిరి. నానాటికధికమై హృదయమును కలఁచివైచుచున్న నిష్ఠురా గ్రహము కడకు తన్నిట్టిపనికి ప్రేరేపింపగా భారవి తండ్రిని తెగనఱకుటకు కత్తినిగైకొని గోడచాటున నక్కియుండెను. తలిదండ్రు లెపుడునిద్రింతురా! తన కత్తికి జనకుని బలినిడుటెప్పుడా? యని పొంచియున్న భారవి వెల వెలఁబోవునట్లు శయనించియున్న ప్రాణపతినిజూచి సుశీల యిట్లనినది.

"నాథా! భారవి మనస్తత్త్వము ఒకించుకయు గమనింపక వాఁడు కంటికి కనఁబడునపుడెల్ల మతిహీనుఁడాయని, గర్వాత్ముఁడాయని నోనాడు చున్నారు. ఎదిగినవాఁడు; ఊరక మాటలాడలేఁడు. ఆసభలో నరివారల నడుమ నిన్న వానిని అనరానిమాటలంటిరి. వానిముఖమున కడకొక నెత్తు రుబొట్టునులేదు. వానిరూపే మారిపోయినది. నిన్నటినుంచి ఈ గడియ వఱకు వానికి అన్నము నీరు అన్న జోలియేలేదు, చూచినంతనే కాలరు దుద్రుఁడై మండిపడుచున్నాఁడు. ఇఁకమీఁదట వానిని నిందింపకుఁడు. వాఁడు మూర్ఖుడుకాఁడు. విపక్షబుధుల గుండెకు గాలమై భోజమహారాజు సభాంగణమున గౌరవాస్పదుఁడని తరచు వినుచుందును. అట్టివానిని

మీరేల నిందింతురో తెలియదు. ఇరువదియేండ్ల యీఁడునకే యింతటి తెలివియేమని, అఱువదియేండ్ల వయసుగల మహాపండితులును వానిని మెచ్చుకొనుచుందురు. వానియెడ మీకిట్టి నిరసనభావ మేలకలిగినదో చిత్రము. నేనికారణమడుగవచ్చునా? వాని అవధాన ప్రతిభ. వాని యాశుధారాశుద్ధి - వీని కాశ్చర్యపడు జనుల ప్రశంసలే దినదిన సభలందురు. పెచ్చుపెరుగు క్రోధానలము సమస్త సద్భావములను మసిచేసివైచును. హద్దుమీరిన వాని యలుక ఎట్లుపొర్లునోయని కృశించిపోవుచున్నాను'!

చిఱునగవు తొలకరించు మొగముతో శ్రీధరుఁ డర్ధాంగితో నిట్లనెను.

దేవీ! మన బిడ్డను దూషించుటకు నేనంత తెలివితక్కువవాఁడనా? మన బిడ్డఁడు చదువుసాములలో నెందును కొఱవడువాఁడుకాడని నాకు తెలియదా? శాస్త్రవాదసరణిలో గడితేఱిన పండితులుసైతము వానినిజూచి వెఱతురు. వాని జయశీలతను నేనెంతో యుప్పొంగిపోవుచుందును. వాని కీర్తి సూర్యచంద్రులున్నంతవఱకు వెలుఁగునట్లీశ్వరుని నిరతము ప్రార్థింతును. మా అయ్య చల్లఁగవర్ధిలి మమ్ము కడతేర్చునట్లనుగ్రహింపుమని భగవానుని కంజలి ఘటింతును. చెలీ! ఒకటిమాత్రము వాని హృదయమునంటిపెట్టుకొని కపలననుచున్నది. "నేనింతవాఁడ" నన్న అవలేపము వానికిఁగలదు. అతఁ డెవ్వరిని లెక్కింపనిసరణి గోచరుఁడగుచుండును. అది నా కసమ్మతము. దేవీ! అహంకృతి యెవ్వరికినితగదు. అది సకల విద్యాభివృద్ధుల కంతరాయము. యశస్సుధానిధికి కళంకము. సౌహార్ద నాశనకరము. కనులున్నను అంధతనొసఁగు పెనుభూతము. మానవుని

అథఃపతనమునకు త్రోవ. వానినెట్లైనను సమూలముగ వాని హృదయమునుండి తీసివైవ వాని నిట్లందునుగాని, కన్నబిడ్డఁడను అనురాగము నాకుమాత్రములేదా? వాఁడు విజృంభిగకున్నచో అతని ఘనతనుగూర్చి కొనియాడవచ్చును- కని ధన్యులమైతిమని ఆనందింపవచ్చును. అన్నియెఱిఁగియు తనలోనున్న యీలోపము నెఱుఁగలేకున్నాడు. మరియొకవిషయము. బిడ్డల లోపము తెన్నవలయునుగాని, వారి గుణములను పొగడ తగదు. ఇది కారణముగ వానిని లేనిపోని దోషముల నెపమున దూరుచుందును.—"

తల్లిదండ్రులొనర్చు సంవాదమును వినుటతోడనే చేతనున్నకత్తి జాఱి నేలపయిఁబడిపోయినది. అశ్రువాహినిలో భారవి మునిఁగిపోయినాడు. బందీభూతుఁడైన చోరునివలె వానిని సిగ్గు అలచుకొన్నది. క్రైపు దిగిపోయినది.

"ఇది కలయా? అట్లయినచో ధన్యుఁడను. కాని ఇది కలగాదు. నాది గుండెయో—చెఱువో? వాత్సల్యరసమూర్తియగు నీ మహాత్ముఁడెక్కడ? నేను చేతులార నలుపఁబూనిన యీ హత్యయెక్కడ?

కొండంతపాపము అరనిమిసములో తప్పిపోయినది. పితల పాద పద్మములపైఁబడి యియ్యెడిదముతో పొడుచుకొని చచ్చెదను.—"

కాని భారవి ఆత్మహత్యకు జంకెను. పశ్చాత్తాపము నిలువున నాతని దహింపసాగినది. ఎటులో నాతడాఁస్థలమునుబాసి తొలఁగిచనెను.

## ౨

కాల విలంబనమున కోర్వక ప్రేక్షకులు నర్తన శాలలయందు కేక లిడునట్లు, పక్షులు చెట్లపై కిలకిలమని కూసినవి. తెరవీడ్వడినట్లు నింతలో పలపలమని తెల్లవాఱినది. రంగభూమివలె జగము వెలుఁ గొందెను. కొదమ కోయిలల గాన సుధావీచికల దొప్పఁదోగి పూలతావులను గుబులు కొలుపుచు, చిఱుగాలి హృదయంగమముగ వీవసాగినది.

తన తీవ్రతర నిరీక్షకు ఫలముగా తూరుపున ప్రొద్దుపొడిచినది. హృదయతాపము కొంత శాంతించుటలు తనముఖము వ్యక్తమొనర్చినది. ఇట్లు భారవితండ్రి—శిష్యులతోడను, మిత్రులతోడను సంభాషణములు నెఱపు గృహాంగణమునకు వచ్చెను. వచ్చుటతోడనే నగమొఱగి నమస్కరించి యిట్లనెను.

"తండ్రీ! జనకుని ప్రాణములను బలిగొననెంచిన కొడుకునకు ప్రాయశ్చిత్తమేమి?"

—సభాంగణము మౌనజలధి మునిగినది. అచటనున్నవారి చూపులు భారవి ముఖమున వ్రాలినవి. "వీనిముఖము నిన్నచూచిన దానికంటె నెంతయో మాఱిపోయినది. వీఁడిట్లు ప్రశ్నించుటకు కారణ మేమో? యథార్థమేదో అయినను చూతునుగాక యని మనముననాలో చించి ప్రజ్ఞానిధానమవుట శ్రీధరుఁడు భారవితో నిట్లనెను.

"వత్సా! అట్టివానికి అర్హమైన ప్రాయశ్చిత్తము అత్తవారింట నాలితో

నాఱునెలల యునికియవును. కాని, యిపుడీ ప్రశ్నయేల పుట్టినది?"

—భారవి దీనమూర్తియై చిత్తరువుబొమ్మవలె తృటికాలము నిలిచెను. అతనిమనస్సు నిర్వేలమచెందినది. కడకతఁడెటులో సంబ ళించుకొని జనకుని పాదములంటి కనుగవనుండి యశ్రువులు రాలు చుండగా ఇట్లుపలికెను.

"తండ్రీ! పరమకఠోరవర్తనుఁడను. విద్యాగర్వమానసుఁడను. కృతఘ్నుడను. మీ ప్రాణముల బలిగొనసుంకించిన పాపాత్ముఁడను. నన్ను మీరెట్లుమన్నింతురో? మదము కనులకు వింత పొరలుగ్రమ్మింపగా పొరబడిపోతిని. నా యున్నతికి మీ రసూయ వహింతురని, నా గౌరవాభ్యు దయమునకు మీరు ప్రబలవిరోధులని భ్రమపడుచుంటిని. నా పుణ్య వశమునఁ గడిచినరేయి నిజము తెలిసికొంటిని. త్వరపడియున్నచో చివరకానరకలోకమునఁగూడ నాకు తావు లేకపోయెడిది. కాని, నేడొఁకరి పంచలనైనను పడియుండు భాగ్యమందఁగంటిని. ఇఁకనాకు సెలవా?"

—వినయ భయభక్తులు ముప్పిరిగొన్న మదితో తనపాదములచాపున నిలఁబడిన కుమారునివంకకు శ్రీధరుఁడు కరుణారసార్ద్రములైన చూపులఁబఱపుచు సాంత్వన మధురవచనములననెను.

"భారవీ! ఎందుకింత చింతింతువు? ఇఁక చాలును. తండ్రిని చంపఁదలఁచిన నీ పాపపంకమంతయును నీ కన్నీటిధారలచే కడుగఁబడి నది. విచారముమానుము. నిజముగ నీవంటి పండితునకు ఒక్క

పశ్చాత్తాపమే తగును. ఈ పాపమునకు వేఱ ప్రాయశ్చిత్తముతో పనిలేదు. తండ్రీ! మూన్నాళ్ళముచ్చటలేగాని—ఆవల అత్తవారింటనాదరముత్తడి, అది కడురోత. మూఢులకుఁబోలె నీకది తగదు.''

—హర్షవిషాదావేశములు తన మదిని పెల్లుబకగా విహ్వలుఁడై భావోద్వేగము తలమీఱగా భారవి పలికెను.

“జనకా! ఇది మానబోనిగాయము. దీనికెచ్చటను మందేలేదు. మేన ప్రాణములున్నంతవఱకును మఱపునకురాదు. ఇంతకును దీవెన నెఱపి నన్నుఁబోనిండు. ఈపాటి శిక్షనైన ననుభవించి మది కొంకించుక యూరటఁ గల్పించుకొందును. దుర్బుద్ధులు క్షమాయోగ్యులుకారు. మానవుఁడేదేని పొరఁబడి యొనర్చి పశ్చాద్వ్యథాయుక్తుఁడైనచో నతఁడు విగత దోషుఁడగును. బుద్ధిపూర్వకముగఁ జేయబూనిన యతఁడు శిక్ష ననుభవింపకతప్పదుకదా?

—హృదయమున వాత్సల్యము తొణకిసలాడగా తనయుని కౌఁగలించుకొని శ్రీధరుఁడట్టులే సోలిపోయెను.

## 3

అల్లునిరాకలు అత్తవారి కపురూపములు. కడకు కృపణుల గృహమునుఅల్లునిపట్ల ఆదరము చూపును. విపులసపర్యల నెఱపును. ప్రాణపతిరాకకును, తల్లిదండ్రుల మన్ననకును పొంగిపోవుచు చిఱునవ్వ

చిందులాడు కడగంటి చూపులతో లోననుండియే ఆమెస్వాగతము తెలుపును. క్రొత్త పెండ్లికూతురుగాన పతిని సమీపించు గుండెదిటవు ఆమెకులేదు. పండువెన్నెలల పాదులలో ప్రోదిగొను సుధాకణముల నెదిగి పారిజాత పాద పాలంబనమువడసి ప్రణయగంధమును గుబు ల్కొల్పు పూవీవయామె. కవికిని శిల్పికిని తలము నకలుషటించు మోహనప్రతిమ. కవితారస విలోలహృదయ యువుట "రసిక" యన్న పేరామెకు సార్థకము. మోముపై ముసురుకొన్న ముంగురులు మబ్బులై, తలపైనిడుకొన్న జరీముసుఁగు ఇంద్రధనువై, చూపుమెఱవు దీవకాగా ప్రణయవర్షమును వర్షించి "రసికాదేవి" భారవి పథిశ్రమమును తొలగించి నది. ఇఁక భారవి కన్నవే శ్వశురాపరోక్షులు - నెచ్చెలి వర్ధనయు నపటి పిండిపంటలకంటె ప్రియములై కనుపట్టినవి. అత్తమామలును, గృహము నందలి మిగిలిన బంధుజాలమును, ముఖముల హర్ష సంభ్రమములు ముంచుకొన, మజ్జన భోజనాదులఁ బనియించుచుండగా తీయగా, హాయిగా రెండునెలలు గడచినవి. మూడవనెలయు ముడిసిముప్పున బడనుండెను. బిగువు నడలిన ప్రాయపుజిగివలె అంతకంత కాదరము పలుచఁబాఱెను. "వీనికి ఊరక ప్రొద్దెటులపోవును" అన్నమాటలు తనచెవినిబడి గుండెను కలఁచగా నతఁడాయిాపనులకు అపాటున చేయిచ్చుచువచ్చెను. కడ కతఁడే తెచ్చికొలు సాతంత్ర్యముతో తనకుతానే అయితపడుచుండెను. తాలుగింజలట్లు నిరాదరణగనిన ప్రాణపతి పరిస్థితులను దలఁచి పుట్టింటి వారి నిష్ఠురతకు రసికాదేవి "ఛీ" యనుకొనును. ఆదరము నశించి పోయెను; మరియాదకూడ. అనురాగ మధుర సంవాదములకు బొత్తుగ

నవకాశములేదు. వేళకు తనకుతానే కుడుచుట కాతఁడలవాటు పడినాఁడు.

ఇంత యెూరుపుతో పతి యిటనే యేల తలదాచుకొనుచున్నాఁడో యని రసిక చింతించును. తనకుమాత్రము ఇది మదితట్టదా? ఈ యువ మానమున కోరిచియైనను ఇటులే యిటఁబడి యుండుటకు కారణ మేమైనఁగలదేమో? లేక వీరిని పరీక్షించుటయా? అని రసిక పలుమారు తనలోఁదాను భర్తసుగుఱించి వితర్కించుకొనును. ప్రాణపతి హృద యము నరయనెంచెను. ఇది తనకు తగదని వెంటనే వెనుకాడును. ఇట్లామెహృదయము పరిపరివిధముల ఊరియాడుచుండును. ఆమెకు నిరంతరమిదే కలవరమాయెను.

తామెటులున్నను, తమ ప్రాణపతుల గౌరవాభిమానములను నతులు నతతము కోరుచుందురుకదా! ఇది వారి నిసర్గ మధుర గుణ మేమో!

౪

కాలము అనాది. అంతములేనిది. ఈ కాలప్రవాహమున మును గుచు తేలుచు జీవకోటి కొట్టుకొని పోవుచుండును. తా మెంతటివారైనను ఇమ్మహాకాలప్రవాహమున తలమునకలు వేయక తఱించుటకల్ల.

అహా! కాలవైపరీత్యము! కాటిమాడకు పుస్తెనమ్మి తెమ్మని

అర్ధాంగిని మగనినోట నడిగించినది. అనుఁగు చుట్టాలచే గురువృద్ధ జనుల తలలను కురుక్షేత్రమున దొరలింపఁజేసినది. నిండుసభలో తమ యిల్లాలిని మానభంగమునుజూడ వీరపతి పంచకమును పాల్పఱచినది. నడుకానలో నిద్రాపరవశురాలైన నెచ్చెలి చీరను సార్వభౌమునిచేతచింపి కట్టుకొనఁజేసినది. తనయునెడబాపి సూర్యవంశ ప్రభవుఁడగు నొకవృద్ధ రాజును జలనిర్గత మత్స్యము నట్లొనర్చినది. అహొ! కాలమొనర్పలేని పనులు విశ్వమున నేమిగలవు? ఇంతకును కాలముగానప్పుడు మొన గాఁడును తల పైకెత్తుకొని తిరుగలేఁడు. ఆకాలమే కలిసివచ్చినచో తన కత్తికెదురులేదు. ఏది యేవేళకువచ్చునో దాని ననుభవింపక తప్పదు గదా? సుఖదుఃఖములు సమకూరినపుడు ప్రేలుటయు, వెలవెలబాఱు టయు వ్యర్థములు. చక్రవర్తులు ఆదరమున నమకూర్చు సమస్తభాగ్య ముల తులదూగుటకు తగిన నా భ్రతుకెక్కడ? కన్నకసుమాలమును సహింపగలుగు ఈ హేయ జీవనమెక్కడ? ఔరా! కాలవిపర్యయము!! కాల పరివర్తనపు సుడిగుండములబడి విలవిల తన్నుకొనకుండు దిట్ట యెక్క డున్నాఁడు? ఊన్నురనక కాలము జెట్టుముప్పుత్రిప్పుల కోర్చికొను ఆత్మ కర్తవ్యసుస్థిరుఁడున్నాడా? ఏమో? అదియును నందియమే? ఆపద ప్రాపించినప్పుడు నెపము విధిపైనిడి వెళ్ళలఁబాఱుట మానవున కాచార మైనది. అందువలన వానికి కలుగబోవు లాభమునులేదు. దానివలన కడుపుమంటయు చల్లారదు. ఇన్నిటికిని మూలము కర్మ. ఒకరినసఁ బనిలేదు. నా విద్యామదమణఁగినదో, లేదోకాని, స్వాభిమానమును మాత్రము పూర్తిగ చంపుకొంటిని. ఏమైనఁగానిమ్ము. నా యోరిమి

ఒఱపిడి కాఁగవలెఁగదా?''

—ఇట్లు తలఁచుకొనుచు, అంతకంతకు వెక్కసమై, ముంచుకొని వచ్చు కడపెడు దుఃఖమును గుటుక్కనమ్రింగి, ధీరుఁడుగాన చలింపక అత్తవారి సూచన కనుకూలప్రవర్తనమే. తన వ్రతదీక్షగనెంచి. భారవి అవుల దోలికొని అడవికి రాఁదొడఁగెను.

కానన లక్ష్మి నూత్నవికాసమును గయిసేసి యుండెను. ఆహ్వానము సేయునట్లు మలయానిలుఁడు తన్నెదుర్కొనెను. ప్రశంసావచనములట్లు పక్షులజలిబిలి ముద్దుపలుకులు చెలరేఁగినవి. ఎదిగిన పచ్చికను చేత నీక సెలయేటి తుంపరలు పదనిడుచుండు నాప్రదేశమున వంచిన మోర లెత్తకుండ పశువులు మేయసాగినవి. అంతికముననే భారవి శరన్నవ మేఘునివలె నిష్కళంకుఁడై చరింపసాగెను. కడుపారమేసి నీరుద్రావి పసులు తరుచ్ఛాయలందు హాయిగ నెమరువేయుచు విశ్రమించియున్నవి. భారవి ఊహాకల్పిత నీరదయానమున గగనమున పయనింపసాగినాఁడు. ప్రపంచాతీతమగు నొకానొకా దివ్యదశయందు కవి సొక్కుచుండునుగదా?

హరిణకుమార గోపకచయ మిరువైపుల నందడింపగా, సమీప శాద్వల భూమిపయి పన్నుండి గోగణము నెమరువేయుచుండ, కరగత మగు లేఖనీ మురళి కమ్మని కవితాగానమును వెల్లిగొల్పు నాతఁడొక నవ్య కృష్ణుఁడన నొప్పియుండెను.

అది నవాగతమగు శరత్కాలము. అతఁడును కవికుమారుఁడు.

అది ప్రకృతి కేకాంతసీమయగు సుందరకాననము. ఇఁక రచన కడ్డే మున్నది? విధివంచనమున ఎంత పతితుఁడైనను భారవి నైజగుణమును తానెట్లు మానుకొనును? కంటికి కనఁబడిన కంటకమెల్ల గంటమైనది. పత్రములకొఱకు పనిపడి వెదుకవలసిన అవసరమును లేకపోయినది.

అచటి కొదమరాయంచల నర్తనమువలె మంజులమై, చఱియల నుండి జాల్వాఱు సెలయేటి చాలువలె నిరర్గళమయి, గైరికవృక్ష్యమువలె నిసర్గమధురమగుచు వానిరచన వెలసినది. ఆ మహాత్ముని కలమునుండి జాలువాఱిన కవితామృతప్రవాహమే కిరాతార్జునీయ మహాకావ్యము. అతని ప్రవాసఫలమిట్లు పరిణతిచెందినది. కవి హృదయ సముద్రమును ఊరక మధించినపుడే కబ్బపు వెన్న పుట్టుచున్నది!!

చక్కిలిగింతలుపెట్టు మొలక తెమ్మెరలరాకచే పులకించి చిఱుగొమ్మ లటునిటు చిందులువైచినవి. ఆ చలితశాఖలపై జంటబాయక కైపెక్కి పిట్ట లుయ్యాలలూఁగినవి. నంజ కెంజాయ ప్రకృతి గుండెపై బంగరు పూఁతపూసినది. మానవుని జీవితక్రమమువలె ఉన్నతుఁడై, తుద కదోగతి చెంది అస్తమించిన సూర్యుని వల్లకాఁడువిధముగా చరమదిశ కనుపించి నది. చివరకా లోకబాంధవుని చితిమంట లాఱిపోయినట్లు సాంధ్యరశ్మ లును రూపుమాసిపోయినది. చందమామ ఉదయించుటతోడనే చీఁక టులు మాఱుమూలల దాఁగుకొనినవి.

భారవి వనమునుండి ఆవులను మఱలించుకొనివచ్చి వానిని దొడ్డి దోలి, దోవతిచెంగున ప్రాణపదముగా ముడిచికొనివచ్చిన కవితాచరిత

పత్రపుంజమును ధ్యానముతో నిత్యము తానిడు పట్టునఁజేర్చెను. మిన మినలీను మేలి ముంగురులు - కుంకుమబొట్టు - గంధాక్షతలు ఎన్ని వన్ని యలుదీర్చుచున్నను రసికాదేవి ముఖము వసివాఁడిపోయి హృదయావేద నను వ్యక్తముచేయుచుండెను. బిడియము తసంతట తానెటకో పరువిడి పోగా నామె వడివడిగ పశువుల సాలలోనఁ బ్రవేశించి ప్రాణపతి పాదము లకు అభివందనమొనర్చెను. ప్రేమవాహిని యుప్పొంగగా భారవి తన యిల్లాలిని కౌగలించుకొనెను. నెమ్మొగమున జీరాడు ముంగురుల సరిది ద్దుచు, అశ్రువులను చీరచెఱఁగున నద్దుచు, వలపు పెల్లుబుకుకొలఁది దుఃఖము హద్దుమీఱగా భారవి యిట్లనును.

"దేవీ! నీకీ ఊడిగము కొంచెమైనను తప్పలేదా? కాకున్న నీమొగ మిట్లేల వాడిపోయినది. ఈ కన్నీళ్లేమి? నేఁటి యీ నీ వైఖరి నీవు వ్రతస్థ వని చెప్పకే చెప్పుచున్నది. ఇపుడు నీమనసేల యింత చీకాకైనది."

తన్నిట్లనునయించుచు నింకేమేమో ప్రశ్నింపనున్న ప్రియుని ముఖ మును రసిక చూచినది.

"—నాదురవస్థకేమిలెండు? ఎట్టులో ఇంటిలో గుట్టుగాఁబోవుమ. ఈ దాన్యసముద్రమునుండి మీకు దరిలేదా? గాదిలల్లుని పసులకాపరితన ఘున కంటగట్టుటా? అబ్బా! యిది నా యెదకు అంపకోఁత. ఈ పాడు కొంప మర్యాదగా మూన్నాళ్లయిన మిమ్ము కూర్చుండనిడి, కుడువఁబెట్టి నదా? ఇంత భంగపాటున కోర్చికొనియైన ఇచ్చటనే తలదాచుకొనుటకు

కారణము నేను తెలిసికొనలేదు. అనుచితమౌనేమోయని మిమ్ముడుగ జంకుదును. ఛీయని బయటికిరాక యిటనే యిట్లు పడియుండుటకుఁగల హేతువునెఱుఁగ ప్రయత్నింపని దినమేలేదు. తెలిసికొనియు నేను చేయు నదేమి? కాన నా మనోవికారము నణఁచుకొందును. మీదురవస్థ కనులార గాంచుచు నావెతలు మీకుఁదెలిపి మీ హృదయమును గలఁచితినేమో యని భయ పడుచున్నాను. నన్ను మన్నింతురా?''

———రసికనిరుద్ధకంఠయైనది. భారవి చెలిని బుజ్జగించుచు తన కనులనుండికాఱు బాష్పములునయితము శుష్కితనందగా పలికెను.

"విధివిలాసమున కేమిసేతము. నీకొనఁగూడిన కష్టమేమో!" రసిక నిట్టూర్పువిడచి యిట్లనెను.

ముత్తైదువతనమును కాంక్షించి స్త్రీజనము గౌరీవ్రతము సలుపుచు చున్నది. నేను నోచుకొనకుండుటెట్లు? కార్తికపూర్ణిమావ్రతము స్త్రీలకు ముఖ్యమైనది. ఇది కొనసాగఁబోదని తెలిసిన నెపుడో మానుకొనియుండెడి దానను. కడకు బంగరు బొట్టుకును, ముదుక త్రైకకును గతిలేకపోయినది. మీ తండ్రినడుగమని తల్లి దూరముగ తొలఁగిపోయినది. దీనికిని పాలువవి అర్థించిన నతఁడు మాఱుపలికినఁగదా? మునుపటిదినాల ఆడుబిడ్డను గాను. తిండికై చేబెరించు దాసిని. నాకేమి యధికారమున్నది. అభిమా నించువారెవరు? నన్నుఁజూచినవారి కింతైన కనికరముగలదా? మీ యసందర్భమెఱిఁగియు, వ్రతలోభమున వచ్చితిని. నా యీ మనస్తాపము చల్లారుటెపుడో? నా చీకటిబ్రతుకున కిక ప్రశాంత ప్రభాతభాగ్యమేలేదేమో?

నేను చీకిచీకి యిటులే నశింపవలెనేమో". భార్య నూఱడించుటకు తెరువు గానక భారవి దిగ్భ్రాంతుఁడై కొంతతడవు మిన్నకుండెను. తుపానువలె చెలరేఁగిన దుఃఖము నెట్టెటులో, లోన నణఁచుకొని కలఁకదేఱి సతికి సంఘటిల్లిన దురంతవిషాదముఁ దీర్ప పాలువోక కడకాతఁడు ఒక పత్రము ను వెలికిఁదీసి యిట్లనెను.

"ఇదిగో! దీనిని తీసికొనుము. ఇక చింతింపకుము. ఏసాధ్వికైనను కుదువఁబెట్టి నీ వ్రతావసరమే కొంచెమైనను తీర్చికొమ్ము.

మన శిక్షాకాలము తోపటితో తీరిపోవును. తెల్లవారకపోదు. ఇఁకఁ గడచిన దినాలవంటి కష్టపుదినములు రాబోవు".

లలితకవనమునకు అక్షరలక్షలిచ్చు భోజుని యేలుబడిలో మహాకవి భారవి వ్రాసిన పద్దియమును కుదువనిడుకొనువారి కేమికొదువ?

కిరాతార్జునీయ మహాకావ్యమునందలి ద్వితీయ సర్గములోని ముప్పదవదగు శ్లోకమున నగమే భారవి అప్పటికివ్రాసినది. ఆమెకిచ్చిన పత్రమున ఆశ్లోకమున నగమేకలదు. ఆశ్లోకమిది.

సహసావిద ధీతనక్రియా
మవివేకః పరమా పదాంపదమ్
వృణతేహి విమృశ్యకారిణం
గుణలుబ్ధా స్స్వయమేవసంపదః॥

౬

పండువెన్నెల ముసుఁగుగప్పుకొని ప్రకృతికాంత హాయిగ నిదురింపసాగినది. గగనమధ్యమున మిలమిలలాడుచు పున్నమచందురుఁడు తారకలను సర్మరహస్య సుధావీచికల నోలలాడించుచుండెను. భడోచి గ్రామము శాంతిరమకు నివాసమై వెలుఁగొందినది. నిశీథినీ నిస్తబ్ధతనుజీల్చి కొక్కొరొకోయని కోళ్లుకూసినవి. వర్ధమానుఁడు తన యింటితలుపును తటతటమని తట్టసాఁగినాడు. ఎంతదూరమునుండి ఎంత దీర్ఘ విరహభారముతో నతఁడు మరలివచ్చినాఁడో? ప్రణయినీ ప్రేమ కాతఁడెంత పరవశుఁడో? తలుపుకడ నాఁగు నిమేషకాలమును అతనిపాలిటి కొక బ్రహ్మకల్పమైనది. ఆనిద్దురలో యజమానుని యెలుఁగు గుఱుతించి పోయిన ప్రాణములు వచ్చినట్లుకాఁగా, తడబడుచు వాకిలిదీసిన వృద్ధసేవకునకు గుఱ్ఱమును గట్టివైవ నాజ్ఞయిడి యిల్లాలినిగాంచు కోరిక తనకంటె మును మున్ను పరువులిడగా వర్ధమానుఁడు శయనమందిరమున కరిగెను.

నిదురించు నెచ్చెలిని మేలుకొల్ప దఱసిన వర్ధమానుఁడు ఱిచ్చవోయి అట్టులె నిలఁబడెను. అతని హృదయమున బల్లెమునాటినట్లాయెను. శరీరమంతయును గ్రచ్చుపొదలో పొరల్పఁబడువిధముగా వానికి దుర్భరమయ్యెను.

“ఔరా! దీని శయ్యపైనున్నవాఁడితఁడెవఁడు? ఏమి స్వైరిణీసాహసము! అహా! దీనిని మనసార నమ్మితినిగదా? హృదయమా! కన్నారఁ జూచుచు నింకను సంశయించుచుంటివా?”

——రోషము కాలుగదిపి నాట్యమాడుచున్న ముఖముతో, నిప్పులను వెలిఁగ్రక్కుచున్న కన్నులతో వర్ధమానుఁడు—

ఓసీ! యింతకు లోకులకడ నామరియాద మంటగలిపితివి. నిన్ను ముక్కలుముక్కలుగా తెగనఱుకకవిడుపను".

నడుమువిగింపున వ్రేలుచున్న కరవాలము నాతఁడు ఒఱనుండి దూసెను. ఆ కత్తి యచటి గోడచిలుక కొయ్యకు తట్టుకొనినది. దానిపైనుండి ఒక పత్రము రాలినది. అదెవనిదో రహస్యలేఖయను భావముతో తలయూచి దానినిగైకొను తన యాత్రమునకు నవ్వుచున్నదోయనునట్లు వెలుఁగుచున్న దీపమును పత్రమును పఠించుట కాతఁడు దఱిసెను.

"చక్కగా వెనుకముందరయక యేపనికిని ఉద్యుక్తుఁడు కాఁగూడదు. చేయిజాఱెనా అనుతాపతప్తహృదయుఁడై హతుఁడుకావలసినదే."

అను భారవి మహాకవి శ్లోకపాదద్వయార్ధమే యతఁడందుచూచినది. వర్ధమానుఁడు తన మనమున శంకించుచు మేలుకొలిపిచూతునని యామెనుఁజంప వెనుకాడెను.

ఈదందడిలో చేయిసోఁకగా నామె దిగ్గన లేచిచూచి పతి దేవుఁగా గుఱుతించి ప్రణమిల్లుచు—

"ఇదుగో! మీ జనకులు వచ్చినారు; నమస్కారముచేసికొమ్ము. లేలెమ్మని తనయుని కదలించుచు నిదురలేపినది.

రాత్రి

ఆ పలుకులు చెవిసోఁకగా వర్ధమానునిగుండె జలదరించినది.

ముసుఁగు తొలగఁద్రోసికొని బాలుఁడు వందనమాచరింపగా నాతడు నిలువున నీరయ్యెను. త్రొక్కుడువడ్డ త్రాచుబామువలెదోఁచు భయద వృత్తిమారి విస్మయసాగరమున వర్ధమానుఁడు మునిఁగెను. ఏవైపును జూడక అటులే తనయునిపై స్థిరదృష్టినిబఱపి సంశయమునఁజిక్కిన మగ నిని పరికించి ఆమె యిట్లనినది.

"నాతండ్రి నాకేమితెచ్చునన్ననాళ్లును, ఈనాఁడెవచ్చునుగదా యన్న నాళ్లును, అచటకే నేఁబోదునన్ననాళ్లును, మీ క్షేమములు తెలిసికొనుటకు కొట్టుకాడిననాళ్ళును—

వరుసగా ఇన్నాళ్లుగడచియు, వచ్చునను నాసవీడక నా జీవితాశయై యొదిగి నేఁడు నా పజ్జఁబరుండిన నీ ముద్దుబిడ్డను అన్యగా సంశయించి తిరా? ఓడబేరములుసాగింప ఊరువిడచి పరదేశమునకు మీరేగునపుడు కన్నీటి వఱదఁదేలు అరుమాసాల గర్భిణినగు నన్ను మఱచిపోతిరా? పదు నాల్గేండ్లు గడచినను పగబూనినట్లు మొగమైనను జూపకుండుటలు మీకు తగునా? నాపై జాలివహించి నేఁటికైనను వచ్చితిరి. నాపాపముకాకపోయి నచో మీరొకతీరుగా ఏల కనఁబడుచుంటిరి?"

కాల్వాలయిపాఱు కన్నీరు దుడుచుకొను నామె చేయిని, తన చేయిఁ జేర్చుచు వర్ధమానుఁడు—

"దేవీ! మనకు దైవము మేలుచేసెను. లేనిచో మిమ్ము జీవములతో

నాచెంతనుండఁజూతునా? భ్రాంతి తిమిరములో మునిఁగిన నా కన్నులకు ఈ పత్రపు మెఱపుకాంతులు తోపకుండినచో ఈగండము గడచెడిదికాదు."

పత్ర వృత్తాంతము అడిగిన మగనికి భార్య బ్రాహ్మణి యొకర్తుక కుదువఁబెట్టుట చెప్పెను. వర్ధమానుఁడు తన నెచ్చెలిని నిండుకౌగిట మన్నించెను.

కవితా ప్రభావమున కాపురము నిలఁబెట్టుకొన్న వర్తకుఁడొసంగు పారితోషకముతో భారవి కాఱుమాసాల గడువుతీరినది.

కవితాప్రవాహికలోని ఒక్కబిందువున కెంతటి ప్రభావము!!!

— మంగళం —

# దేశభక్తి

శ్రీకృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయయాత్ర ముగించి కావ్య వినోదములతో నానందించు పుణ్యకాలమది. విద్వత్ప్రభువగు నాంధ్రభోజుఁడు భువనవిజయమను పేరోలగమున్నతఱి పాండ్యపతి చంద్రశేఖరుఁడరుదెంచెను. రూపముధరించిన శోకమువలెనున్న పాండ్యమహీపతి ఆంధ్ర భూరమానాయకునిఁగని సవినయుఁడై వచించెను.

"మూరురాయరగండా! ఆంధ్రభోజా! మీకు జయమగుఁగాక! తొలకరిమబ్బులో మెఱుపుతున్కవిధమున శత్రు సైనిక సమూహమునందు జొఱఁబడి మునుముబట్టి తెగనఱకి నెత్తుటికత్తిని గౌతమీ కృష్ణవేణులందు కడిగి హైందవభూమిలో శాంతిని గుబుల్కొలిపితివి. కటకముమొదలు కన్యాకుమారివఱకుఁగల భూఖండమున గుఱ్ఱముపై స్వారిసాగించుచు నెచ్చట నేయడ్డములేక వెలిఁగితివి. కీర్తి గంగాతరంగములందు ధారుణిని వసంతస్నానములాడించితివి. విద్యారణ్య మౌనీంద్రుల యమృత హస్తములచే ప్రతిష్ఠితమై యలరారు విద్యాపురము నేఁడు అమరావతినిఁగూడ హసించుచు నీయున్నతిని మార్మ్రోయుచున్నది. దేవా! మిమ్మెమని కొనియాడుదును? కడఁగనుల మృదుమధురహాసరేఖలు హవణిల్లఁగా, తొలుకారు క్రొమ్మెయిలు గర్జలవంటి పలుకులు గభీరతను — సరసతను వెలార్చుచుండఁగా ఈ భద్రపీఠము నధిష్ఠించియున్న మిమ్ము, నా కష్టకథ

విన్నవించుకొని కలఁచలేను. ప్రభూ! అనురాగరంజితములు మీ యపాంగవీక్షణములు నన్ను మన్నించునా? నేల నాలుగుచెఱఁగులందును నిలుపనీడలేని దైవదుర్విలసితునకు దీనతఁ జాటుకొనుటకు సంశయములేదు. అంతకుమున్నే లజ్జయునులేదు. కరుణారస స్తిమితములైన మీ కనుఱెప్పల చలువపందిటి నీడలలో వత్సరములు వాసరములట్లు గడుపుచు సుఖించుచుంటిని. ఇన్నాళ్ళదాక ఈ కన్నులనుండి దుఃఖబాష్పములు రాలలేదు. నేఁడు బ్రతుకుపై నిరాశజనించినది. పరాభవాగ్నికీలలు గుండియను కుమిలించుచు కంటికి కూడుకురానీవు. దెసలు నోళ్ళుదెఱచుకొని దిగ్రమింగ పొంచియున్నట్లు తలఁపునకుఁ దోచుచుండును. శాంతియెట్టిదో అణుమాత్రమునైన నెఱుఁగను. దేవా! పాపపుఁదలఁపు నెన్నఁడైన మదిఁజొఅనిచ్చితినా? నీతిమార్గమునువీడి చరించునట్లు మీరు వింటిరా? తలఁచుకొన్న గుండె నీరవును. మధురాపురము కేవల మొక శ్మశానమైనట్లుంబడినది. ఎంతటి పాపకాలము!! తనకు చోళదేశముచాలదా? ప్రశాంతమయమగు పాండ్యరాజ్య లక్ష్మి లలితహృదయమును జీల్చి, కాఱు కటికనెత్తుటేటి తరఁగలలో నోలలాడుచు వీరశేఖరుఁడు పాండ్యమునేలుచు నన్నీగతిచేసినాఁడు. పిడుగులుపడి యీ నా హృదయమును వ్రీల్పనేల? నాకింకను చావుమూడినదికాదు! జీవితముఖమున నిఁక సదృష్టరేఖను జూచు దినమువచ్చునా? దరిబేసిమొగముతో పాండ్యుఁడిఁక వికాస నిరానములైన పొద్దులను నెట్లుబుచ్చఁగలఁడు? అహా! ప్రాణములింత తీపవునా? వైరుల పాఱఁద్రోలి కీర్తినైనఁగొనక, సమరమునైన సమయక ఆప్తవర్గము నడవులపాలుచేసికొని, కాలికొలఁది పరువెత్తివచ్చుటకు సిగ్గు

పడని యీ నికృష్టుని దేవా! మీరు మన్నింతురా? నేనే పాపము నెఱుఁగను గాని, చెఱసాలపాలై మనస్తాపాగ్నిలో కుమిలిపోవుచున్న ప్రాణివాసము నిర్బంధమును బాపలేనైతిని. నీపాదపరాగలేశము శుభమునాపాదించునని నమ్ముకొని వచ్చితిని. రక్షింపుడు. నా గృహదీపకను నిలిపి నా హృదయ సముద్రమున రేఁగిన యీ తుపానును హరించి దయతో కాపాడుఁడు."

పాండ్యవల్లభుఁడు ఆంధ్ర నరేంద్రుని పాదములను కన్నీటిచే కడిగెను. సుధర్మ సభామధ్యముననున్న సింహాసనమున నధివసించు నింద్రుని తలఁపునకుఁదెచ్చుచు 'భువనవిజయ' సభామధ్యమున నొప్పు భద్రపీఠముననున్న రాయలు లేచి తన పాదముల జంటపైఁబడియున్న పాండ్యపతినిఁ గ్రుచ్చియెత్తి వసివాళ్ళువాఁడిన యాతని మోము గలువను కరుణారసామృత స్తిమితములైన చల్లనిచూపు వెన్నెలల వికసింపఁజేయుచు నిట్లనెను.

"—చంద్రశేఖరపాండ్యా! అటు నీకును, ఇటు నాకును ఈ పరిభవ జ్వాలలను భరింపఁదరముగాదు. తనకు కాలముచాపించియే చోడుఁడీ కుపథమునుద్రొక్కెను. తనకు తెలుఁగుదొర జ్ఞప్తికిరాలేదేమో! ఇన్నిఁటికి వానిపాపము లీనాఁటికి పండినవి. కైఁపు కనులఁబోపగా ప్రపంచమును గనుటెట్లు? తనశక్తిని, ఎదిరిశక్తిని బుద్ధి గుఱుతింపనీదు. నాశాసనము కాదని వానికి తోడ్పడు మగవాఁడెవఁడు? అట్లు తోడ్పాటునూపి యెట్లు హతముగాకుండునో అదియునుచూడమా? రణరంగములలో పాలికేకల బాకులు వినరుచు వైరిభటుల గ్రుంటెలుచీల్చి పచ్చి నెత్తురులలో వసంత

ములాడు కోఁడె నాగులు - తెలుఁగుజోదులను అతఁడు లెక్కింపకపోయెఁ గదా? అహెూ! తనకెట్టి యెగ్గును తలపెట్టని పావనమూర్తిని దుర్భర దుర్వ్యథలకు గుఱిచేసెను. పాండ్యునకు దిక్కుమ్రొక్కులేదని యూహించెఁగాబోలు! ముకుళీభూతములైన తన కన్నులను చోళుఁడిప్పుడే విప్పుఁగాక! పాండ్యపతీ! మీరడలకుఁడు. మీ హృదయవేదన శాంతింపగా, ఆ పాపాత్ముఁడు కూడుగుడ్డలకు చేడ్పడఁగా, వ్రాలిన పాండ్యధ్వజము మరల గగనమున నాట్యమాడగా, ఈనాఁడే సైన్యములు నడచును—"

చెంత వసించియున్న దండనాథుని రాయలు వీక్షించెను. "నాగమ నాయఁడా! రుధిరనాఁడు లుడుకగా కథనంతయు వింటిరిగదా? చోళుని పశుకృత్యమును దలఁపుఁడు. గంటులువడిన గుండెతో పాండ్యపతి తానే యిటకువచ్చెను. ఆంధ్ర శౌర్య లక్ష్మీగౌరవమును నిలుపుఁడని మేము వేఱుగ వచింపవలసినదిలేదు. పాండ్యరాజ్యము నాహరించి పాలనమొనర్చుచున్న కుమతిని మనము విడువము. వానిపాపము వానికే ఒప్పగింపవలసియున్నది. చోళరాజ్యమును బలిగొనక తెలుఁగు మగఁటిమి తెల్లమగుటెట్లు? ఆ తంజావురి కోటకొమ్మలపై తెలుఁగు జెండా యెగురవలెను. కార్యోత్సాహదీక్షా కంకణధారివి. నాగన్నా, విజయశ్రీ మిమ్ముగాక అన్యునెట్లు వరింపఁగలదు. మీ శౌర్యగాథలు మాకు క్రొత్తలుగావు. హితమతియగు పాండ్యపతికి పాండ్యము నప్పగించి, చోళహతకుని శిక్షించి - చోళదేశమున త్రిలింగసింహపీఠికి ప్రతినిధి పాలకుని నియమించిరండు. ఎప్పుడు వత్తురో? తెక్కలుగట్టుకొని తేపేపాటి కిచ్చుట వ్రాలవలెను—"

వైరిభటుల గుండెలు దద్దరిల్లగా, ప్రళయమేఘగర్జనవలె రణదుందుభి మొరసెను. తుంగభద్ర అలిగి కావేరిపై దండెత్తిపోవుచున్నట్లు నేల గ్రక్కదలగా నాంధ్రసైన్యము కదలెను.

౨

పరిషన్మధ్య సువర్ణపీఠికను రాయ లధిష్ఠించియుండెను. కారుణ్యమూర్తియు, కవితా రసాస్వాదన మత్తచిత్తుఁడునగు మహాంధ్రపతి రౌద్ర రసోద్రిక్తుఁడై కన్పట్టుచుండెను. తన మిసిమిసినవ్వు క్రొన్నిగ్గులు కవుల మేడలకు బంగారుపూఁతలు. తన విచ్చిన మనస్సు చింతాతపతప్త హృదయులకు నిద్దపుగొడుగు. తన ముఖకమలము త్రిలింగ కవితాసుందరికి నర్తనరంగము. కాగా, వర్ధిలుచున్న తెలుఁగుతేఁజు నేఁడు త్రొక్కఁడు వడ్డ కోఁడెత్రాఁచువలె రోషభీకరుఁడు. ఇంతకు నెవనిని కాటందునున్నాఁడో తెలియరాదు! అమృతక్షాళితమైనట్లు వెలుఁగొందు ముఖముపై బ్రహ్మతేజము మినమినలు వెల్లిగొలుపుచుండగా మతివైశారద్యమును చూపులు చాటుచుండగా, నృపుని పార్శ్వమున సముచ్ఛ్రితపీఠిపయిఁ గూర్చుండియున్న మంత్రిసత్తముని హృదయమున కోటియూహలు చెలరేఁగినవి. తన కన్నులనే తాను నమ్మఁడేమో? మరలమరల లేఖమును చూచుకొనుచు. "ఔరా! యితఁ డింత తేనెబూసిన కత్తియా?" అని భావించెనేమో? ఈర్ష్యాపూరిత హాసరేఖలు తిమ్మరుసు ప్రధాని ముఖమున పొటమరించినవి.

చలించుటకు వెసుదీయుటేమి? కడకుచ్ఛ్వాస నిశ్వాసముల సైతము సభ్యులు సలుపలేదు. భయవిభ్రాంతులు తొట్రిలు క్రీఁజూపులతో

వ్రాలిన తలలట్లే వ్రాలియుండెను. సభాస్థలియంతయు విచిత్ర చిత్రజగతీ చక్రక్రమాపర్ణమును తోపింపఁజేసెను. నిప్పుకలు వెలిఁగ్రక్కుచున్న కన్నులతో ప్రభువు సభను నలుగెలఁకులఁ బరికించెను. సభ్యులు చక్రవర్తిమోమును దర్శించినవారుకారు; గాని, మర్మముల నొప్పించుచున్న మాటలనుమాత్ర మాలించిరి.

"—వీరమనీఁడా! నీ తండ్రిగారి భక్తి పాయలుపాయలై తెలుఁగు గడ్డపై ప్రవహించినది. ఇఁక నేబీజములెట్టెట్లు పాదమునో? ఇష్టార్థసిద్ధికై ఏయేత్రోవలు ద్రొక్కునో? ముందుగా నూహించుటెట్లు? మేమేమని యాన తిచ్చితిమి? తానేమియొనర్చెను? మున్ముందేమి యొనర్పందలఁచెనో? పాపము! భూమిని పాలింప కునికి తనకింతగా ముఖమువాచెనే? ఈ తల పోఁతలు వాఁతలవలనఁగాని చక్కఁబడవేమో? ఇట్టి దుష్కృతికి ప్రాయశ్చిత్తమున్నదా? ఇంతటి రాజ్యదాహము నిన్నాళ్ళు తానెట్లోర్చికొనెను? అగ్నిపర్వతమువలె తన మనస్సు లోలోనఁ గుములుచుండెఁగాఁబోలు! కాలాంతరమున నది బయటవడ్డది. అహా! తడిగుడ్డగప్పి గొంతులుగోయు 'స్వామి' యని తలఁపలేదుగదా? ప్రణయ మధురహృదయముతో తన్నాదరించుచుండుటలే తప్పాయెఁగదా? ఇంతయొనర్చిన ధీరుఁ డిఁకెంత యొనర్పలేఁడు? వాని నాలుకతీపి—అంగిలి చేఁదు తేఁటవడినది. చింత నిప్పుకలలో మూర్ఖుఁడు కాలుజొనిపినాఁడు. అఫలమునందక తానెట్లు తప్పించుకోఁగలఁడు. చెట్టు చెడుకాలమునకే కుక్కమూతి పిందెలు పుట్టును. తన విభునిపట్ల సేవకుఁ డెట్టి భక్తిని ప్రదర్శించినాఁడు! అప్పాజీ! ఏది! ఆలేఖను వానికంపింతు. తన్నే పాండ్యపతిగా ఆ భూప్రజ

లెన్నుకొన్నారఁట! పాండ్యుఁడిఁక రాజైన చిక్కులిన్నే నంభవించునఁట! మహాభాగుఁడు పలుకునది విన్నారా? అఱకాల మట్టగింపక గర్వోక్తుల చాలింపఁడు! చోళరాజ్యమును తన భుజావిక్రమమున లోఁగొనెనఁట! కాన, తాను పాలింపఁదలఁచినాఁడఁట! మేలుమేలు. తెలుఁగుదొర తల మీఁదనే కాలిడలేకపోయినాఁడు. త్రిలింగ వసుంధరోన్నతికి తన రక్తము నంతయు ధారవోసినాఁడఁట! మాసేవలో తన తల నెఱసిపోయినదఁట! ఇఁక సేనాపతియైయుండుట తనకేమాత్ర మిష్టములేదఁట! సభ్యులు వింటిరికదా? తన జీవితమంతయు నాంధ్ర చక్రవర్తి సేవయందును, ఎడతెగని జైత్రయాత్రలందును పొల్లవోయినదఁట! హాయిగ తానుగూడ పాండ్య చోళముల రెండింటిని బాలించుచుండుటను మేము సహించి యుండుట న్యాయమఁట! ఏమి ఏని విపరీతవాక్యలు! అతఁడు మమ్మింత చులకనసేయునా? ఈ మా అభ్యుదయమునకు తానే మూల మని యేమేమోవ్రాసి మాకే యీనాఁడిట్లు లేఖలంపుటకు భీతిఁజెందఁడు గదా? ఈ యౌద్ధత్యము తెలుఁగుదొరముం దెట్లుసాగును? మద మాయు న్మాత్రమును పుటుక్కునఁ ద్రెంచునని యీ హంవీరుఁ డెఱుఁగఁడు.

ఆ కుటిలాత్ముని తలనైనను — అతనినైనను బట్టితెచ్చు మగవాఁడీ కొలువులోనున్న ఇదిగో! యీ ఖడ్గమును గొనవచ్చును—"

రాయలు దిగ్గన పీఠమునుండిలేచి తళతళ లీను కరవాలమును గైకొనెను. మ్రాన్పడియున్న సభ్యసమాజము శ్రావణమేఘగర్జనల లేఁటి

పదుపువలె చకితమైపోయినది. సభ్యులు సంగతి యెఱిఁగియు తమ చేఁజేతుల నిండుప్రాణము లెట్లు బలిపీఠినుంతురు? దవాగ్నివలె చేరరాని వాఁడు నాగమయ్య. వాని యెట్టయెదుట నెవరు కాలూని నిలువఁగలరు? సదస్యులకు మేనులు వడఁకినవి. నాల్కలపై చెమ్మయేలేదు. సభ్యులు కనుఱెప్పలు వ్రాల్పక ఒకరిమొగముపంక మఱియొకరు చూచుచు నూర కుండిరి. దండనాయకు నింత కొకఁడైనఁ దెచ్చుట నిజమా? ఈగడ్డలో కుందేలుదెబ్బకు పులులుగూడ తకపికలాడెనఁట! దానికి తార్కాణ మిది యేనా?—లేదు లేదు; నశింపలేదు. ఆంధ్ర శౌర్యశక్తి నశింపలేదు. వీర రసార్ద్రమైన యీ పురాణభూమిలో శౌర్యతేజము నశించిపోలేదు.

ఎవఁడు—తేని ముంగలకేగి కరవాలమును వేఁడునోయని వికలాత్ములై ప్రజలు చూచుచున్న ముహూర్తమున — రాజభక్తి తన యెదలో పాదుకొనగా ప్రభుని మ్రోలకు సవినయుఁడై హుటాహుటి నడచిన వీరమ నేఁడు పలుకును.

"——ఆ లఘుబుద్ధిని తండ్రియని పల్కి పాపమును మూటగట్టు కోలేను. లోకనిందకైనను జంకక తిన్నయింట వాసాలను లెక్కఁబెట్టిన హంతకునిఁజేరి దుర్యశమునంది సుఖింపలేను. ప్రభూ! నా కతఁడు జన కుఁడేయగుఁగాక! ఈ తెలుఁగుజాతిని నపకీర్తిపాలుచేసి ప్రభువునకు ద్రోహమొనర్చెను. తన మదిలో తానేమని తలఁచినాఁడో? తన భుజబల మునేనమ్మికొని యీపనికి తెగించినాఁడుగాఁబోలు! యుద్ధరంగమున దానిపసయు తేలిపోవును? నా జన్మభూమిని నా ప్రభుని గణుతింపక వాద

ములాడుచున్న యా కుటిలాత్ముని తక్కలుగట్ట తెత్తును. ఏడీ! ఖడ్గమును వయసేయుఁడు—"

సాదర భక్తిపూరిత హృదయుఁడై వీరమనేఁడు చేయిసాచెను. సాంధ్యరాగచ్ఛవియును, తొలుసంజదీప్తియు నేకమైనట్లు నృపునియొక్కయు మహామాత్యునియొక్కయు లలితదృక్కు లొండొంటితోఁ గలిసెను. వసంతప్రభాతప్రభలు వెల్లివిరియు ముఖమున వెదఁద కనుపోయి అబ్బురపాటునందగా ఆంధ్రకవితా పితామహులు—"అల్లసాని" వారు త్రిలింగపతినిఁజూచును. కావ్యరచనకిది రుచిరపు విధానమని భావించిరేమో?

"ఆ తండ్రి యంతయొనర్చెను; ఈబిడ్డ యికెంత యొనర్పఁడు? అని కొందఱు తలఁచిరి. చక్రవర్తికేమైన మతిచలించినదా? అకాయలోని విత్తునకు కత్తినిచ్చెనని మఱికొందఱనుకొనిరి. పళవాయికడుపున వీరమయ్య తప్పఁబుట్టినాఁడని :వేఱొకకొందఱును, తెలుఁగుగడ్డ శౌర్యతేజమును గోల్పోవలేదని యిఁక కొందఱును భావించిరి. ఇట్లు వీరమనేనిగుఱించి సభ్యులు పరిపరివిధముల తలపోసిరి. రాయలు వీరమనేనికి చురకత్తినొసఁగిరి. దానిని కంఠోయికద్దుకొని అతఁడు—గుఱ్ఱపు సకిలింతలతో, గజఘీంకృతులతో, నదజోదుల ధీరవాక్కులతో ఓక్కుహరములు ప్రతిధ్వనులనీన తోడనేయేగెను.

## 3

"——తండ్రీ! యిరువదైదువర్షములు వాత్సల్యము పొంగారు మదితో తల్లిలేని నిసుఁగును లాలించి పాలించితిరి. ప్రణయస్నిగ్ధమైన

మీ హృదయమును నెంతని ధ్యానింతును? ఈ ఋణము నెట్లుతీర్చుకొందును? వందనములుపక్క నేనేమియొనర్తుసు? అది యట్లుంపనిండు. హృదయమును విప్పిపచింతును. అన్యథాభావింపకుఁడు. ఈ శిశువు పలుకుల కేమియని యుపేకింతురేమో! జీవితము లెడారిలోని పడియలవిధమున రూపుమాసిపోవుటకు నామనసు తల్లడిలిపోవుచుండును. అఱువదేడులు తలపై తాండవించు వయసులో, భక్తియుక్తులతో రమారమి ముప్పదేండ్లు సేవయందునిలిచినవేళలో, ముక్తిమార్గము నాలోచింపవలసిన కాలములో నెట్టితలఁపు నేఁడు మీమది నుదయించినది. పాండ్య చోళముల నేలుకొనుచు హాయిగ బ్రతుకుమని ప్రభువానతీయఁడుగదా? మఱి యీ దుర్భావనకు శిరమెట్లొగ్గినావు? ఇది కృతఘ్నబుద్ధిగదా! కోపము గదురనీక మారుపలుకుఁడు: మొయిలు బాలెంతరాలి మంచు చనుఁబాలచుక్కల చల్లఁదనమును, పక్వ ద్రాక్షాఫలరసముల తియ్యందనమును, పసిపాప మోము చందురు వెన్నెలలందు మెండుకొను స్నిగ్ధతావిభూతియు, పొదుగును ముందలఁబొడిచి పాలుద్రావు లేఁగను దనియించు గోమాత కడుపుతీపియు—కరడుగట్టిన దొరకు నాతని కడగంటిచూపుల సుఖమందు భృత్యుఁడు ద్రోహమొనరింపఁ దలపూనుట ధర్మమా? ప్రేమపురుషాకృతిని పొల్చెననఁదగిన అమృతహృదయుఁడుకాఁడా ప్రభువు? అట్టి సౌహార్దమూర్తిని గొలుచుకన్న ధన్యత మఱేమున్నది?

అనురాగరేఖలు నేత్రాంతములఁ దళతళలాడగా, ప్రసాద సుధల వెలార్చు — ఆ దివ్యమంగళముఖము జేవురించుపనికి పాలువడిన మిమ్మే

మందును? ముందుపోయిన గోయి — వెనుకకేగిన నూయి చందముగ నున్నది. మొన్న ప్రభునిపాలికి వినయమును గంగలోఁగలిపి గుండెను మండించు కమ్మనంపితిరి. అది సాహసముకాదని మీరు చెప్పఁగలరా? రాజ్యదుర్వాంఛ విశ్వాసాత్ములనుసైతం మేపనికైనను పురికొల్పునేమో? క్షీరసముద్రమును బడబాగ్నివలె నరపతి హృదయసాగరమును మీలేఖ కలఁచివైచినది. ఒక్క ప్రభునేకాదు; సభలోనున్న సర్వప్రజలను మూఁగవోయిన మొగములు కంపమునందగా ముక్కులపై వ్రేళ్ళిడుకొనని సభ్యులా సభయందొక్కరునులేరు. నీతివర్తనమున "కోట్యము" వంశము విఖ్యాదినందినదను పలుకున నిండిన నిజమును నేఁడు పళవాయి బాగుగ బట్టబయలొనర్చెను; బలేబలే యని మిమ్ము తూరుపాఱబట్టక కడకొక్క నదస్యుఁడైనను విడచిపెట్టలేదు. తుంగభద్రాతరంగ భంగిమలతీరుతోపఁ బలుకు ప్రభువు కడుపు భగ్గుమనిపించు మీ కటికపనికి నిప్పులు వెళ్ళగ్రక్కినాఁడు. మిమ్ము పట్టితేగఁల వీరుఁడు కొలువులో నున్నాడాయని గర్జించినాఁడు. సభ అట్టుడికినట్లుడికిపోయినది. ఒకరికిని నోటినుండి మాటరాలేను. మిమ్ము పట్టితెత్తునని పలికి అంధ్రవిభుని చేకత్తి నందికొంటిని.

"అతఁడు కన్నబిడ్డకాదా యితఁడు? నీరు పల్లమెఱుఁగదా? తండ్రితోఁ జేయిఁగలపక తాను పట్టితెచ్చునా?" అని కొందఱు దెప్పినారు. ఆపలుకులు చెవులలో "గింగురు" మని ధ్వనించుచు హృదయమును గాసించుచున్నవి. ఎవరినేమందును? మీరొనర్చిన ద్రోహము మిమ్మేకాదు; నన్నుకూడ పొరిగొనుచున్నది. వాత్సల్యరసమును వర్షించి మీరు చేతు

లార సాకిన తీగయిది. దీనిని నేఁడు త్రుంచివైచుటకు మీ చిత్త మెట్లొప్పె నది? పెనుమంటలలోఁజిక్కి దిక్కులేని చావునకు గుఱియైనను చింత లేదు. అపయశముగూర్చు పూఁబాటలలో నడచుటకైనను నితఁడు పాలు పడఁడు. నీవంశమును నిలువుసఁగాల్పక నృపుని కోపాగ్ని చల్లారదు. అవల బూదిరాసులు రాజ్యభోగముల ననుభవించుఁగాఁబోలు! ఒకింత యోజింపఁబనిలేదా? ప్రభుని పాదములపైఁబడి మిమ్ము కాచి రక్షింపఁ బ్రార్థింతును. దయానవనీతము కరగి కృష్ణానదియై యాతని జాలిగుం డెలో నిరతము ప్రవహించుచుండును. దొర మీతప్పులసైచి రక్షించును. అమ్మ నన్ను పురిటిపొత్తిళ్ళలో పాదివి యెదఁజేర్చుకొని చనుఁబాలు నోట జార్చుటెఱుఁగను. "లాలి లాలీ" యని జోకొట్టుచు నిద్రఁబుచ్చుటెఱుఁ గను. "చందమామరావె - జాబిల్లిరావె" యని పాలబువ్వ దినిపించు టెఱుఁగను. పలకయు, బలపముఁబట్టించి "కా-ఖా" లు దిద్దించుటెఱుఁ గను. అన్నిఁటికిని నీవే తల్లివైతివి. తండ్రీ! విధివంచనమున నింతజరిగి నది. దానికై చింతిలకుఁడు. ప్రభునివేడి మిమ్ము దక్కించుకొందును. పండినప్రేమ నొసఁటిపై రేఖలుదీరఁగా, ప్రీతి గుండెలోన నీతలను గొట్టగా కుడిచికూర్చుండు మిమ్ము కనుగొనును నా రెండుకనులు కృతార్థ తఁగాంచనిండు. నాకిష్టములేని యీ భూఖండములు మీకుమాత్ర మెందు లకు? ఉరికంబమునెక్క తలఁపు మీకెందులకు?

తండ్రితో కొడుకు అధర్మశీలుఁడై పోరొనరించెనను పలుకులను నేను వినరాదు. నాగమసేనాని ప్రభుని దండనమునకు గుఱియయ్యెనన్న దుష్కీర్తికి తలనొగ్గుటయు మీకు తగదు. దేవా! సైన్యమిప్పుడే యీ పాలి

మేరలో విడనినది. దొరముందు మిమ్ము గొనితెత్తునని ప్రతినవట్టితిని. నాపై నాగ్రహింపక, నా దీక్ష ఫలింపగా, నా హృదయము వికసింపగా, బయలుదేరిరండు. ఏనుగుపై కూర్చుండఁబెట్టి పరమహర్ష పరవశమతినై మిమ్ము కొనిపోదును. ఎగ్గసిగ్గులులేక యెట్లు ప్రజుని మ్రోల నిలువఁగలనని తలఁపకుఁడు. జనకా! మిమ్మొకటి ప్రశ్నింతును. ఎన్ని యుద్ధరంగముల తిరుగాడిన మీరు రెండుపక్షములకును జయమగుటఁ జూచితిరా? విజయము మమ్ము వరించిన మీ వియోగదుఃఖముచే నేను మరణింతును. మీరు లబ్ధవిజయులైనచో మీ బిడ్డను చూడలేరు. శత్రువులు బెండుపడ కదనరంగముల భుజశక్తినిజాటి జయదుందుభుల మొరయించినారు. మీకెవరు సరివత్తురు? కాని, నేఁడు మీపక్షమునందు ధర్మములేదు. ఇఁక మమ్మెట్లుజయింతురు? నా పలుకు నాదరించి, నెనీపనిని నిర్వహింతునని విశ్వసించి, ప్రభువనుజ్ఞ యొసఁగినాఁడు. కాన, పెడవారిదొక్కక శీఘ్రముగరండు. రేపటిదాక మీరాక కెదురుచూతును. అవల విధికృత మెట్లున్న నట్లుకాఁగలదు—"

ఇట్లువ్రాసి వీరమనేఁడు కమ్మను జనకుపాలికంపెను.

౪

రాజులెంత కృతఘ్నులు. వారికంటె కటిక రక్కసులెంతయోమేలు. ఒక సేవకుఁడు ముప్పదేండ్లు రేఁబవళ్లు అష్టకష్టములకోర్చి గడించిన రాజ్యమున తాను విశ్రాంతినిగోరి మేనువ్రాల్చుటను చూచి సహింపఁజాలరుకదా? పరరాజుల జయించి తాము భూఖండములను బడయవచ్చును.

మమ్ముబోటివారు జేసెడు భూమినిగూడ కోరఁదగదు. కోరినచో నిఁకఁ జెప్పఁబనిలేదు. చిక్కని మేనికండలు నశించిపోయినవి. కత్తిని గాటువైచినను ఒక నెత్తురుచుక్కయు రాఁబోదు. ఇట్లు కుమిలి కృశించిపోవుట తప్ప సుఖమన నెట్టిదో యెఱుఁగము. చేసినసేవ ప్రభువు గుఱుతింపక పోయెఁగదా? కడకు నాగమసేనానికి ద్రోహియన్న బిరుదము దక్కినది. విస్రములపై తనకు లేఖవ్రాసి పంపితిమిగదా? మాయెడ నింత కోపము జూపుటకు మేమొనర్చిన నేరము? సేవకుఁడు శాంతిని - సౌఖ్యమును కాంక్షింపరాదా? ఛీ; రాజులఁగొలుచుకంటె నైచ్యమింకొకటిలేదు.

తెలుఁగు తేజము భూనభోంతరముల దీపింపగా, ఆంధ్ర జయశబ్దముల దిక్కులు మార్మ్రోయగా బంగారు గద్దెలపై కులుకుచు కూర్చుండియున్న రాజునకు తనకోస మెందఱు తమ ప్రాణములు ధారవోయుచున్నది తెలిసికొనుటకు హృదయమున తావేలేదు. ఏఱుదాటి తెప్పను గాల్చుటే రాజహతకు లొనరించుపనులు. వారితోపొందు బ్రహ్మయంతవానికైనను మరణమును ఘటింపకతప్పదు. ఇం దసత్యమేమున్నది? చివరకు మా వ్రేలితో మా కంటిపాపను పొడుచుటకు దుడుకుతేఁడు పూనుకొనెను. మా తలనుగొట్టి కోటకొమ్మలకుఁ గట్టించుటకు తానెంత యుబలాటపడుచున్నాఁడో? పాండ్యునకు ఔరస పుత్త్రుఁడు లేఁడుగదా? మఱి, యారాజ్యమొక దాసీసుతుని చేతఁబడుట సంతోషమై, నిన్ను నమ్మికొని, నీసేవలో నష్టులతిగిన యొక సేవకుఁడు నీ జెండాకు తలవంచి పాలించుట నేరమయినదా? ఎంతటి ప్రాణియైనను తన జాతిగుణమును

తానెట్లు బ్రాయనేర్చును? శ్రీకృష్ణదేవరాయా! తెలిసి తెలిసి నిన్నునఁ జనే మున్నది.

మాతృకా! కడుపులోఁ జిచ్చుపెట్టితివిగదరా? నాల్కలు సాచుచు పయిఁబడవచ్చుచున్నావా? నీ శుభమునకై పరితపించుచున్న కన్నతండ్రిపై కత్తినిదూయు తలఁపులు నీమది నెట్లుదయించినవి? బాబా! ఇట్లింటిసని యాగ్రహింపకుము. నయమూర్తి వెంతలో నెంత మారిపోయితివి. ఆనంద పుష్పశయ్యలపై హాయిగ పన్నుండి సొక్కి సోలిపోవుచున్న మనస్సును ముండ్లకంచెలఁ బడనీడ్చుట న్యాయమా? నా తండ్రీ! ప్రక్కలోని బల్లెము గుదువని నే నెన్నండును దలఁపలేదే? మలీమసమార్గమునఁ బడిపోదు వని కలనైన భావించలేదే? నీతల్లి భూమినిబుట్టని పుణ్యాత్మురాలు. అట్టి యిల్లాలిని మట్టిలోఁగలుపుకొనియు, నిన్నుఁ జూచుకొని బ్రదుకనెంచితిని. బాబూ! యీ ముదివగ్గుపయి నీకింత యీసేల? చెట్లకు ప్రదక్షిణములు చేసి, కనఁబడిన రాళ్ళకెల్లమ్రొక్కి, అనశనవ్రతములుండి కడకు కడుపు చల్లఁగ నినుగంటిమి. నా ఆశలు అడుగంటింపకుము. పోగడపూదండ త్రాచుబామగునని, నరన గోక్షీరము కాలకూటముగునని, లేఁటి కొదమ బెబ్బులియగునని కలలోఁగూడఁ దలఁపలేదు. మా బాబుగారడుగో! అన్నం తనె కేలుమోడ్చి యెదురుగ చనుదెంచునపుడును, తీయని తేనెలొలుక, ముద్దుముద్దుగఁ బలుకునపుడును, ఇరువదేండ్ల యీడుననే కాణను బోతును పిడిగుద్దులఁజంపి భుజశక్తిని జాటునపుడును, నాగమయ్యే జన్మ తరించినది;— వజ్రాలమొలకను కనినాఁడని పెద్దలు పలుకునపుడును, ఆనందమున నింతంతై మిన్నంటితిని. ఈ కూన వంశ గౌరవమును

నిలుపునన్న ఆశలతో తెప్పగా తేలిపోతిని. అన్నా! వలదు. శాంతిసరస్సును కలఁచవలదు. బ్రతికినంతకాల మిఁక బ్రతుకఁబోను. దుర్మార్గుఁడవై కన్నతండ్రికి దుర్భర మనోవ్యథను గూర్తువేల? రాజులను కొలిచి నేఁడు నీతండ్రి యెంత ప్రాభవమునందెనో యొకనాఁడు నీవును అదే ప్రాభవము నందెదవు. ఇది తప్పదు. సేవకుఁడై సాటిలేని బోగముల ననుభవించు కంటె స్వేచ్ఛావృత్తిని బిచ్చమెత్తుకొని జీవించుటయే మేలు.

స్వామిద్రోహిని పట్టితెచ్చుటకు నా తెలుఁగుదొర సభలో మీసములు గల మగవాఁడే లేకపోయెనా? సెబాసు; కోట్యము వంశగౌరవమును నిలిపితివి. నీవు నాపై కత్తిపచ్చినను చింతలేదు. నీ భుజావిక్రమమునకు తండ్రీ! శరీరము గగుర్పాటునందుచున్నది. ఏదీ! ఒక్క కౌఁగిలింత; ఒక్క ముద్దు.

బంగారుమనసు ఏరీతిని మారిపోయినది. అందులకే యీ పరివేదనము. కూటికై రాజుకొంపఁజేరి బ్రతికెడు గులాముల మాటలకేమి? వారు ఏగాలికా తెరచాప లెత్తుచుందురు. అది యెఱుఁగక కన్నతండ్రి కటిక కసాయియని బంధించి కొనిపోవవచ్చితివా? ఎంత కృతఘ్నుఁడవు. నిన్నుఁ జెనకు తలఁపును కన్నప్రేమ అడ్డుచున్నది. కడుపుతీపికి వశుఁడైన తండ్రి గుండెలో కొఱ్ఱుగ్రుచ్చి కులికెదవా? ఒకమాటవినుః నీ అభ్యున్నతికి దేహమును తృణప్రాయముగఁజూతును. నీ మదిలోని భ్రాంతివీడి సైన్యముతోవచ్చి మమ్ముజేరుము. అవల రాయలేమి — హరిహర బ్రహ్మాదులును మనవైపుకన్నెత్తి కాంచలేరు. ఇంకను సందేహమా? ఓరి నిర్భా

గ్యా(డా! నా మాటను పెడచెవినిబెట్టెదవా? కేవల రణశూరమౌళి నీకంటె పలుచనగు మనస్సుతో పుత్రవత్సలుఁడగుట నట్లుపలికినాఁడు. ఇన్నిటి కిని తప్పుత్రోవలఁబడిన నీకు నయపద్ధతి రుచింపదు. ఎవరివ్రాఁత లెట్లు న్నవో యట్లేగదా జరుగును? దీని కేడ్పుమాత్రము ఫలమేమి? రాజుగారి కాళ్ళవ్రేళ్ళఁబడి ప్రాణముల కాతునని ప్రేమ పొరలిపోవునట్లు పలుమాట లాడితివి. ఈతల నేలఁబడుదనుక చేతులచేవ ప్రదర్శింపకపోము. అవల రాజునకు మా శిరస్సునుజూపి యాతఁడొసఁగు పారితోషకముల నానంద ముతో నందుకొనుము. పాపభయమైనను, కరుణాస్వభావమైనను నీదుండ గమును మాన్పలేకపోయినవి. కొడుకుకొడుకని మేమేల గగ్గోలుపడవలెను. అంతయుఁ పిచ్చిగాక యెవరికెవరు? యుద్ధమునందు నీవు చత్తువేని ఒక్క యేడుపుతో కడుపుమంట చల్లారును. మా బొందిలో జీవములు మసలు నంతవఱకు నీ కోరిక సిద్ధించుట కల్ల. పెడత్రోవత్రొక్కినది నీవు; మేము కాదు. బాగుపడఁదలఁచినచో బయలుదేరిరమ్ము. ఇప్పటికేమియు మించి పోలేదు. లేకున్న ఱేపే నిన్ను రణరంగములో కలిసికొందును.

కుమారుని లేఖకు నాగమయ్య యిట్లు బదులువ్రాసి పంపెను.

౫.

భేరీ భాంకారముల దిక్కులు భేదిల్లినవి. మత్తాశ్వ రింఖా సముద్ధూత పరాగము గగనమునఁ గ్రమ్మినది. వీరభటుల పాదఘట్టనములచే భూమి కంపించిపోయినది. వీరమనేఁడు కదనరంగమునకు కదలివచ్చెను. అతఁడు పట్టుజీనుల తేజిపై కొలువుదీరినాఁడు. కుచ్చుల తలపాగ శిర

మున శోభిలగా, కట్టిన పట్టుపుట్టములు బంగరు క్రొన్నిగ్గుల వెలార్పగా, కుంకుమబొట్టు ముఖమున నలరారఁగా నతఁడొక క్రొత్త పెండ్లికొడుకు వలె కనులకు విందుగొలుపుచుండెను.

చేతులకు వీరతాయెతులను, కాలివ్రేళ్ళకు వీరమద్దియలను ధరించి, చెందిరము నొసఁటఁబెట్టుకొని తెనుఁగు బంటులు కిలారించుచుండిరి. వారు చిచ్చఱపిడుగులు. వారినెదిర్చి ప్రాణములతో బయటఁబడుటెట్లు?

కనకతప్పెటల మ్రోఁతలచే, శంఖధ్వానములచే దిక్కులు వ్రీలఁగా మత్తగజమునెక్కి చతురంగబల సమేతుఁడై నాగమసేనాని కదన భూమికి తరలివచ్చెను. శాత్రవుల గుండె లవియుట యటుండ, వారి గుఱ్ఱములు సైతము నాగమయ్యపేరు చెవులఁబడినంతనే మేఁతమేసి నీరు ద్రావవఁట! వాని మగఁటిమట్టిది. కత్తివ్రేటులఁ దిని కాయలుగాచిన బాహువుల నప్పళించుచు విరోధుల మారిమనఁగు వీరునితో నరిసరిఁ బోరఁగల శూరులెవరు?

కన్నకొడుకుతో తండ్రియు, కన్నతండ్రితో కొడుకును కత్తుల పోరాటమునకు దిగినారఁట! అహో! తెలుఁగునాఁట విధి యెట్టి చిత్రఘటన కలుగఁజేసినాఁడు.

శాంతిలక్ష్మి ఆస్థలమునుబాసి యెటకో పరువిడిపోయినది. కరాళ వక్త్రమును దెఱచుకొని కలుషమృత్యువు కదలివచ్చినది. కత్తులఁదెగిన తలలను గుట్టవైచుకొని, దానిపైనెక్కి యుద్ధ దృశ్యమును కనులవిందుగఁ

గాంచసాగినది. కాఁకలుదేఱిన వీరుఁడు కదనమునందు బాంధవ్యమును, మిత్రత్వమును, గురుభక్తిని, భ్రాతృభక్తిని గుఱుతింపఁగూడదాయేమి? జీవులపై దయారసమును వర్షించుట పాపమేమో!

అలుఁగులు బాఱుచున్న నెత్తురుటేళ్ళలో మొండెములు తెప్పలుగాఁ దేలెను. ఊర్పులు - పెడబొబ్బలు మిన్నుముట్టినవి. రెండుపక్షములును జయేచ్ఛతో పెనఁగసాగినవి. వారు తమ ప్రాణములను గడ్డిపరకలవలె లెక్కింపక పోరాడఁజొచ్చిరి. అంతకంతకును పోరు ఘోరమైనది. చేవలు ప్రాంగు మాటలచే తన సైనికులను ప్రోత్సహించుచున్న కొడుకును నాగమనేఁడు రాగరంజిత నేత్రములఁ గాంచెను. ఒకదానివెంట మఱొక్కటి పొడమి, ఒకదానినొకటి నమయించుచుండు తరంగములగుచు కోటియూహలు అల్లకల్లోలమగుచున్న వాని హృదయ సముద్రమున నుప్పతిల్లినవి. తన కుమారుఁడే తనపైకి దండెత్తి వచ్చినాఁడన్న కినుకతో నాగమయ్య కలహరంగమునకు వచ్చెనుగాని, కానక కన్నబిడ్డమొగమును గాంచినంతనే వాని బుద్ధి మారిపోయినది. విరోధుల తలలతో చెండాటలాడు దళవాయి మేటి మగఁడయ్యును పుత్రమోహ మలముటచే నిర్వీర్యుఁడయ్యెను. చేతులారసాకి సంతరించిన లేఁగ పొడువవచ్చినంతనే కసాయివాఁడుగూడ దానిని తెగనఱుకఁగలఁడా? కడుపుతీపి యట్టిది. కడుపును అంపముతో కఱకఱమని కోయునపుడు పొడము వేదన ననుభవించుచు ఆశ లిఱ్ఱింకులింకఁగా, తనయునిఁ దలఁచుకొని నాగమయ్య విలపించును.

"—దేవా! నిరంతరము నీ పాదపద్మముల సేవించు మాకు గండ కత్తెరను దయచేసితివా? మనోవ్యధతో నీ భక్తులు కుంగిపోవుచుండుట చూచి సంతోషించుట నీకు ధర్మమా? ఈ విషఫలమును మాకీయకుండి నచో హాయిగ బ్రతికిపోయెడివారమే? కడుపుఁబండించికూడ మమ్ము గాసి పెట్టుటకు మేముచేసిన నేరమేమి? విరూపాక్ష ప్రభూ! కాంచుటకు కన్నులు — నడచుటకు కాళ్ళులేని ప్రాయములోనున్న మమ్ము కడుపునఁ బుట్టిన బిడ్డ పీఁకె నులుముటకువచ్చెను. మేముచేసిన తప మేయేటఁ గలిసినది? అక్షయ భుజావిక్రముఁడగు తనయు నను గ్రహించితివిగాని, వాని మదిలో పితృభక్తిభావమును పాదుకొలుపకపోతివి. అనాఁడే వీని నీయకున్నచో, మాకీనాఁడు చింతలేదుగదా? అనుఁగు బిడ్డలను చంపుకొని తిను పాఁపజాతిలో మేము జనింపలేదు. దేనినిఁగోరి వీనిని నేఁడు బలి గొందును? కనికరములేక యీ వంశాంకురమును గిల్లివైచి మేము బడయు ముక్తియేమి? ఈ నేలను కలకాలమేలఁబోము. బ్రతికినంతకాలమిఁక బ్రతుకఁబోము. తన మనస్సునకు నచ్చినత్రోవలో ఈ యాతతాయి తాను నడచునుగాక! మా ఆశాజ్యోతి చల్లారినది. అంధతమసగర్భములో మే మణఁగిపోదుము—"

ఆకు తుదనుండి రాలు మంచుబొట్లవలె, నాతని కనుఱెప్పలనుండి అశ్రుకణము లొలికినవి. ప్రాణములతోడి జాతి బొమ్మవలె నతఁడు కన్పట్టెను.

తనయుని బలఁగము బహుళమగుటవలనను, తాను తేజమును

గోల్కొండవుటవలనను నాగమయ్యకు పట్టువడక తప్పినదికాదు. ఇన్నిఁటినికి దైవనిర్ణయ మిట్లుండగా తప్పించుకొనుటెట్లు?

ప్రాణములతో తండ్రి పట్టువడినందుల కింతింతనరాని యానంద ముతో వీరమనేఁడు సైన్యపరివృతుఁడై విద్యానగరమునకు బయలు వెడలెను.

౬

ఆంధ్ర సార్వభౌముని కడగంటి చూపువెన్నెలలచే పులకించిన రాజ్య మునకు ద్రోహమొనర్చి, అతని కోపమునకుగురియై మాచేత బందీకృతుఁ డైన నాగమనాయఁ డితఁడే ప్రభూ! తెలుఁగు పౌరలు నామనవి నాల కింపఁ బ్రార్థితులు. నన్ను అల్లంతదూరమునఁ జూచినంతనే చేతులు సాచి "నా తండ్రీ! రావోయి!" యని హృదయమునకు హత్తుకొని యానంద బాష్పములచే నా తలను దడుపు తండ్రి నేఁడు రాజద్రోహమునకై బంధి తుఁడు. వత్సా! యని తాను నన్నును, జనకా! యని నేను తన్నును ఈపై పిలుచుకొన నోచలేదేమో! దేవా! నా కీ ప్రపంచమున సర్వస్వము మీరును — నితఁడును. కాని, ద్రోహియైన యీ తండ్రిని కరుణింపుఁడని యెట్లు విజ్ఞప్తిచేసికొందును. నాకిఁక నిరాశాధ్వాంత విశ్వమునందు మీ పాద ములేదిక్కు. తన్ను ప్రేమార్ద్రదృష్టిని గాంచు దొరచేతదండనమును గైకో వమన్న ద్రోహికి పుత్రుండనుగాన, నన్ను దుష్కీర్తి యంటక విడువదు. ఈ ప్రజాకోటిలో నన్ను నోనాడక యెవఁడు మన్నించును? రాజపరమేశ్వ

రుని దయాహృదయమును—వైరి భీకర భుజశక్తిని తానెఱుఁగఁడా? శిక్ష ననుభవింపవలసియున్నట్లు ముఖమున లిఖించియుండగా తానెట్లు గౌరవ భాగ్యమునందుచు సుఖింపఁగలఁడు?''

బొటబొటరాలు కన్నీటి బిందువులు మడుగులుగట్ట పాయలై ప్రవహింపగా వీరమనేఁడు తలను వంచెను. దయ కొలువుకూటమున గజ్జెలు గట్టి నటించెను. రాతి గుండెలు సయితము వెన్నవలె కఱఁగిపోయినవి.

వసుమతీశుఁ డేమిపలుకునో చూతమని యేమఱుపాటునందక ప్రజలు నిక్కి చూచుచుండిరి. త్రిలింగ భూవల్లభుఁడు వీరమనేని భావమును గ్రహించి కన్నుల చలువలు చిప్పిలగాఁబలుకును; “నాగమనీఁడా! ఇంత విశుద్ధమతివి పాపచింత కెట్లు పాల్పడితివి? నీ ప్రభువు నిరాశఁగూర్చెనా? చెప్పుము: న్యాయపథమున చరింతువని నమ్మియుంటిమిగదా? ఇట్లెందుకు మారిపోయినావో? నిన్నుఁగన్నసేలకై, నీ ప్రభునికై నెత్తురు చిందిన ధన్యుఁడవు. నీ విమలభక్తిని, నీ ప్రేమమును, నీ చిత్తశుద్ధిని కలనయిన శంకింపము. ధాత్రీపాలనాసక్తి నీకున్నచో కాదంటిమా? నీ స్వామి యెట్టివాఁడో నీకు తెలియదా? నీ తపము బూదినిసలువు హోమమయిపోయినది. ఎవఁడు నిన్ను ప్రేమించెనో యతనికే కీఁడొనర్చుటకు నీ మనసెట్లు వచ్చినది? నీవంటివారే నీతినిబాసిన పాపమొనర్చుట కింకెవరు జంకెదరు? పితృపాదులు దివికేగినసమయమున రాజ్యమును కబళింపఁగవిసిన శాత్రవసమూహమునకు యమద్వారముఁజూపి ప్రభుభక్తిని జాటితివి. ఈమేలు నీ ప్రభువు మఱచిపోలేదు. నేఁడు నీదోషమును సహించినాము.

అకలుషమతివై హాయిగా కన్నకొడుకుతో సుఖించుచు జీవితశేషమును గడపుము. ఇఁక చింతమానుము. అదిగో! కన్నుల నీరిడుకొని మా మనస్సును నొప్పింపకుము. నాగన్నా! గతమును స్మరింపక ఉన్నతిఁగాంచుము—"

పాపపంకమంతయు కన్నీటిచే క్షాళితముకాగా, నాగమసేనాని పసిబిడ్డవలె భాసిల్లెను. తెలుఁగుదొర యెట్టివాఁడో అతనికేగాక, అచటి జనసమూహమునకంతయు తేటతెల్లమయ్యెను.

"ఇట్టి దయాశాలి యెందైనఁగలఁడా? ఈనాఁటి దృశ్యము అబ్బురము గొలుపుచున్నది. ప్రభు వింకేమిపలుకునో వినవలెను—" అనెడు కౌతుకము ప్రజల ముఖములందు మెండుకొనెను.

"——మా యాజ్ఞను తలఁదాల్చి భక్తిభరిత మానసుఁడవై కన్నతండ్రిని పట్టితెచ్చితివి. నీవంటి భృత్యుని కీర్తింపకుండుటెట్లు? అనాఁడు కాఱుదున్నను చంపి మా ప్రాణములను కాపాడుటలు నీదొర మఱచిపోలేదు. వత్సా! నీ హృదంతరభావము మా కవగతమైనది. చింతింపకుము. నీ తండ్రిని కాచితిమి: ఈపై వీరమనేనివలన సేవలుగొనుట న్యాయము కాదని మా ఆత్మ బోధించుచున్నది; వినకతప్పదు. నీ ప్రభు నానతిని జవదాటకుము. పాండ్యపతి అమృతాత్ముఁడు. నీ బాహశక్తి—ప్రభుభక్తి మనస్సును సొగయింపగా తన రాజ్యము నీకొసఁగనెంచినాఁడు. ఆతని యౌదార్యము శ్లాఘనీయము. ఇట్టివారుకలరా? ముసలి నోల్లని పాండ్య

రాజ్యలక్ష్మి బాలవీరుని కరస్పర్శనమున పులకించుఁగాక! ఓయీ! గార్హస్థ్యమును స్వీకరింపుము. ద్రవిడ కాంతాధరామృతము నాస్వాదించుచు పరవశుఁడవై నీ తెలుఁగుదొరను మఱచిపోవుగదా? బలే — ఈమాట నీతలపై నెంత సిగ్గు బరువుంచినది. చిన్నతండ్రీ! మఱి అననులెమ్ము. తన్ను ముదుసలి యన్నందులకు మాపై నలిగి "అఱువదికే యేమిముదుకఁడ" నని మా పాండ్యపతి పలుకునుగాఁబోలు" అని రాయలనఁగా పాండ్యునితోఁబాటు ప్రజలును పక్కుమని నవ్విరి.

"ప్రభు వెట్టి రసికుఁడో చూచితిరా?" అను భావము వ్యక్తముకాగా, అల్లసాని పెద్దనగారు ముక్కుతిమ్మనాది కవిదిగ్గజములను కలయఁబరికించిరి. బందీకృతుఁడై చెంతనే నిలఁబడిన వీరశేఖర చోళపతివంకకు ఆంధ్రనాథుఁడు తేటనెమ్మోమును ద్రిప్పినాఁడు.

"——సభలోనున్న ముఖములన్నియు పకపకలాడుచుండగా నీకొక్కనికే దండనమువిధించుటకు మామన స్సొడఁబడుటలేదు. నీబాహుబలమునుగూర్చి వినియుంటిమి. ప్రేమార్ద్రహృదయుఁడవై మాకొలువుతో సర్వసైన్య నాయకపదమునంది యశముఁబడయుము—"

మహాప్రసాదమని చోళపతి ఔదలపంచెను. వందిమాగధ బృందముల స్వస్తివాచకములు కొలువుకూటమున మారుమ్రోఁగెను.

మంగళం.